# గద్య పద్య సంకలనము

## నాలవ ఫారము

### ప్రత్యేక పఠనము


సంపాదకులు:

ఉభయ భాషాప్రవీణ

బోడేపూడి వేంకటరావు

నోరి నరసింహశాస్త్రి



ప్రకాశకులు

నోరివారు: రేపల్లె


మూల్యము

75 నయాపైసలు

(డెబ్బదియైదు నయాపైసలు)

# జాతీయ గీతము

జన గణ మన అధినాయక జయ హే
భారత భాగ్య విధాతా.
పంజాబ సింధు గుజరాత మరాఠా
ద్రావిడ ఉత్కల వంగ
వింధ్య హిమాచల యమునా గంగా
ఉచ్ఛల జలధి తరంగా
తవ శుభ నామే జాగే
తవ శుభ ఆశిష మాగే
గాహే తవ జయ గాథా.
జన గణ మంగల దాయక, జయ హే
భారత భాగ్య విధాతా
జయ హే, జయ హే, జయ హే,
జయ జయ జయ, జయ హే.

# పరిచయము

నేఁటి విద్యాప్రణాలిక ననుసరించి నాలుగు ఐదు ఫారముల విద్యార్థులకు ప్రత్యేకపఠనమున కనువుగా సోపానక్రమమున ఈ గద్య పద్య సంకలనములు చేయఁబడినవి. విద్యార్థులకు ప్రాచీనాధునికాంధ్ర వాఙ్మయములం దభిరుచి కలిగించునటుల రచనయందు విషయమందు, గౌరవము వైవిధ్యము ఆకర్షణము నుండున ట్లివి సమకూర్పఁబడినవి. ప్రతిపాఠమును ఉపాధ్యాయు లెట్లు చెప్పనగునో విద్యార్థు లెట్లు గ్రహింతురో మనోవీథిలోఁ జిత్రించుకొని యీ పాఠ్యములు కూర్పఁబడినవి.

మా ప్రయత్నమును సహృదయులగు విద్యాశాఖాధికారులు, పాఠశాలాధిపతులు ఉపాధ్యాయులు నాదరించి మమ్ముఁ బ్రోత్సహింప బ్రార్థించుచున్నాము.

మేః మర్థించినంతనే ఆదరాతిశయముతో నీ సంకలనములలోఁ దమతమ రచనలు ప్రచురించుట కనుమతించిన కవులకు రచయితలకు సంస్థలకు మా కృతజ్ఞతాపూర్వక వందనములు.

సంపాదకులు.

# విషయ సూచిక

# నాలవ పాఠము

## ప్రత్యేక పాఠ్యము

## పద్యభాగము

## 1. ధర్మ విజయము

ఎఱ్ఱాప్రెగ్గడ

(శ్రీ మదాంధ్ర మహాభారతము, అరణ్య పర్వము)

సంస్కృతములో వేదవ్యాసుఁడు రచించిన మహాభారతమును, నన్నయ, తిక్కన, ఎఱ్ఱయ లాంధ్రీకరించిరి. అందులో నన్నయ ఆది సభాపర్వములను ఆరణ్యపర్వములోఁ గొంతభాగమును రచించెను. తిక్కన విరాటపర్వము మొదలు తుదివఱకుఁ బదునేను పర్వములు నాంధ్రీకరించెను. కొఱవడిన యారణ్యపర్వమును ఎఱ్ఱయ పూర్తికావించెను. ఈ ముప్పురు కవులకు 'కవిత్రయము' అను నామముకలదు. ఈ పాఠ్యము ఎఱ్ఱయ పూరించిన యారణ్యపర్వభాగములో సప్తమాశ్వాసములోనిది.

వేదవ్యాసుఁడు నాలుగువేదముల సారము మహాభారతములోఁ బొందించుటచే దానికి 'పంచమవేదము' అను ప్రఖ్యాతి కలదు.

ఎఱ్ఱయకు శంభుదాసుఁడు, ప్రబంధపరమేశ్వరుఁడు నను బిరుదములు కలవు.

ఇతఁడు రచించిన యితర గ్రంథములు హరివంశము, నృసింహపురాణము, రామాయణము. రామాయణము ప్రస్తుతము లభించుటలేదు. ఈ కవికి నన్నయ తిక్కనల యుద్దఱి పోకడలుఁ గలవు. పతివ్రతాశిరోమణియగు సావిత్రి, తన భర్త ప్రాణములఁ గొనిపోవుచున్న యమధర్మరాజు వెంటనంటి, ధర్మదేవతను మెప్పించి యనేకవరములఁ బొంది, భర్తప్రాణములంగూడ సాధించిన ధర్మవిజయ మీపాఠ్యములోఁ జూడనగును

ఆ. దానిఁ జూచి దండధరుఁడు నీ విట్లేల
వచ్చెదవు లతాంగి వలదు నిలువు
మింతి నీ కగమ్య మిట మీఁది తెరువెల్ల
ననిన నతని కిట్టు లనియెఁ బోలఁతి. 1

క. పతు లెందుఁ జనిన నచటికి
సతులకుఁ జనవలదె నీప్రసాదమునను మ

త్వతిభక్తి కతమునను సం
స్తుతగుణ నా కరుగరాని చోటులుఁ గలవే. 2

వ. సజ్జనసందర్శనం బెప్పుడు వ్యర్థగాదు గావున సజ్జనశేఖరుండ వకం జను నీదైన సందర్శనంబునం బరమ శుభంబులం బొందక యేను రిత్తజనంబుల తెఱంగున నూరక యెట్లు మగుడుదు ననిన దాని ప్రగల్భ వచనంబులకు నద్భుతం బంది ధర్ముం డిట్లనియె. 3

ఆ. తనులతాంగి భవదుదారవాగ్భంగికి
మెచ్చువచ్చె నాత్మ నిచ్చువాఁడ
వేఁడు మొక్కవరము విభునిజీవిత మొక్క
టియును దక్క నేది యయిన నొండు. 4

చ. అనవుడు మద్రిరాజసుత ప్రాంజలియై సమవర్తితోడ ని
ట్లను రిపుకోటిచే నపజయంబునఁ బొంది వనాంతరంబునం
దనవరతవ్రతాభిరతుఁడైన మహాత్ముఁడు సాళ్వభూవిభుం
డనఘుఁడు లబ్ధచక్షుఁ డగునట్టులుగాఁ గరుణింపవే మదిన్. 5

క. నావుడు నట్టుల యయ్యెడు
నీవిట రావలవ దుడుగు నెమ్మి నని వెసం
బోవఁ దొడంగెను బితృపతి
యావెలఁదియు నంతనిలువ కరిగెఁ బిఱుందన్. 6

వ. ఇట్లు చని చని మఱియు నిట్లనియె. 7

చ. ఎడపక వాఙ్మనఃక్రియల నేరికి హింస యొనర్పఁ బూన రె
య్యెడలను దీనులం గరుణ యేర్పడఁ బ్రోవన చూతు రిచ్చచోఁ
గడమవడంగ నీ కెదిరి కాంక్షితముల్ దుదిముట్టఁ దీర్తు రె
క్కుడుమదిఁ గూర్తు రాశ్రితులకున్ విను మిన్నియునార్యధర్మముల్.

వ. అనినం బ్రేతపతి యాపుణ్యసతి కిట్లనియె. 9

క. తృషితుఁ డగువానిఁ బరిలఘు
తుషారతోయములు మోదితునిఁ జేయుగతిన్
హృషితాంగుఁ జేసె ననుఁ గ
ల్మషరహితము లైన నీ సమంజసఫణితుల్. 10

వ. కావున సత్యవంతు ప్రాణంబులు దక్కం దక్కిన కోర్కె యెయ్యది యైనం జెప్పుము సఫలంబు సేసెద ననిన. సావిత్రి దేవా వైరులచేత నపహృతం బైన రాజ్యం బెప్పటి యట్ల ద్యుమత్సేనుండు ప్రాపించునట్లుగా ననుగ్రహింపవే యని వేఁడు టయు వైవస్వతుం డట్ల యగు నని పలికి యిట్లనియె. 11

ఆ. వలదు నిలువు మింక వదలక నీభక్తి
మగని కెక్క దుర్గమంపుఁ ద్రోవ
యిది కృతంబు లయ్యె నెల్లయు నీ విట
వచ్చు సెలవు లేదు వనజనయన. 12

వ. అనిన నమ్మహాభాగ యతని కి ట్లనియె. 13

క. ధర్మాత్ములు తమసలిపెడు
ధర్మక్రియ దప్ప రెట్టి దశలందును మో
హోర్మియుఁ దాపముఁ బుట్టవు
ధార్మికహృదయములఁ బ్రథమధర్మాధ్యక్షా. 14

క. కావునఁ బతియనుగమనం
బేవిధమున విడువఁ దగునె యె ట్లయినను మో
హావేశముఁ బొందక ధ
ర్మావస్థితి సలుపవలదె యవహితబుద్ధిన్. 15

తే. అనిన సంతసుఁ డిట్లను నతివ నీవు
ప్రకటధర్మవిశేషతత్పరవు గాన
యింక నొకవర మిత్తుఁ బ్రాణేశు బ్రదుకు
వలదు గాని యెం డడుగుము వలయుదాని. 16

వ. అనుటయు నక్కాంత కృతాంజలి యై మాతండ్రి మద్రేశ్వరుం డపుత్త్రికుం డతనికిఁ బుత్త్రశతలాభంబు గావలయు నని యభ్యర్థించిన నట్ల కా నిచ్చితి నని పల్కి ధర్మరాజు నేఁడు నీవు గడుదూరంబు వచ్చి డస్సి తింక మగుడుట లెస్స యని పలికిన నప్పతివ్రత యి ట్లనియె. 17

తే. నాకు డప్పి యెక్కుడిది మనంబు భర్తృ
చరణపంకజాసక్తమై కరము భక్తి
నలరుచున్నది సతులకు నన్య మెట్టి
దియును ధర్మమె భర్తృసంశ్రయమ కాక. 18

ఆ. ఆత్మధర్మనిరతు లైన పుణ్యాత్ములు
దుర్లభులు సమస్తదురితములును
శాంతిఁ బొందు వారి సంసర్గమునఁ దీర్ఘ
భూతమతులు వారు భూతలమున. 19

తే. ఏడుమాట లాడినయంత నెట్టివారు
నార్యజనులకుఁ జుట్టంబు లగుదు రనినఁ
జిరసమాలాపసంసిద్ధిఁ జేసి నీకు
నేను జుట్టమ నని వేఱ యేల చెప్ప. 20

వ. కావున మిత్త్రిమనోరథం బవశ్యకర్తవ్యంబుగాఁ జిత్తగింపు మనిన
నమ్మహానుభావుం డబ్భామినిదెసం గనుఁగొని నీకుం బ్రస
న్నుండ నైతి నభీష్టం బైనవరం బొక్కటి యిచ్చెద వేఁడు మనిన
నమ్మానిని యి ట్లనియె. 21

చ. పతివిరహంబు దుస్సహము భర్తృవినాకృత యైనకాంత దూ
షిత యగు సర్వమంగళవిశేషములందును గాన మత్ప్రియుం
డతులితకీర్తిశాలి సుగుణాఢ్యుఁడు సాళ్వసుతుండు లబ్ధజీ
వితుఁడుగ నిమ్ము ధర్మపదవీపరిరక్షణ పుణ్యవీక్షణా. 22

వ. అనిన నట్ల చేయుదు నని యాక్షణంబ కృతాంతుండు సత్యవంతు
నపగతపాశుం జేసి యాసుందరి కి ట్లనియె. 23

చ. కొను మిదె నీమనఃప్రియునిఁ గోమలి వీఁడు చతుశ్శతాబ్దముల్
మను నిటమీఁదఁ బుత్త్రులఁ గ్రమంబున నూర్వురఁ గాంచుఁ గీర్తివ
ర్ధనుఁ డగు సంతతాధ్వరవిధానములం బరిపుష్టి సేయు న
య్యనిమిషకోటి కెల్లను నిజాన్వయమాలివిభూషణుం డగున్. 24

వ. అని యాదేశించి యాతం డంతర్హితుం డయ్యె నక్కాంతయుఁ గ్రమ్మఱి చనియె. 15

### ప్రశ్నములు

1. "విను మిన్నియు నార్యధర్మముల్." ఆర్యధర్మములేవి ?
2. భర్తృప్రాణములు దక్క నితరము కోరు మనిన యముని సావిత్రి యడిగిన వరములేవి ?
3. కడుదూరము వచ్చి దన్వి తనిన యమునితో సావిత్రి పలికిన దేమి ?
4. అభీష్టంబైన వరము కోరుమనిన యమునితో సావిత్రి యేమనెను ?
5. భర్తృప్రాణము లిచ్చుచు యముఁడు సావిత్రితో నేమి పలికెను ?
6. "తనులతాంగి! భవదుదారవాగ్భంగికి మెచ్చు వచ్చె" ఆ వాగ్భంగి యెట్టిది ?

### విశేషములు

**సమాసములను గుర్తించునది :-**

తనులతాంగి, వాఙ్మనఃక్రియలు, కల్మషరహితము, చతుశ్శతాబ్దములు.

**సంధులను గమనించునది :-**

సజ్జనులు, హృషితాంగుఁడు, మోహోర్మి, ప్రాంజలి.

**వ్యాకరణవిశేషముల నెఱుంగునది :-**

దుర్గమంపుఁద్రోవ, అమ్మహాభాగ, కూర్తురు, సఫలంబుసేసెద.

"తృషితుఁడగువాని........" ఈపద్యమునందలి యలంకారమును గమనించునది

### రచన

ఈ కథాభాగమును సంభాషణరూపమునఁ జిత్రించునది.



# 2. హిమగిరి సందర్శనము

అల్లసాని పెద్దన

(మనుచరిత్రము)

ఈ భాగము అల్లసాని పెద్దన రచించిన మనుచరిత్రమను ప్రసిద్ధనామముగల స్వారోచిష మనుసంభవమునుండి గ్రహింపఁబడినది. ఆప్రబంధ మాతఁడు క్రీ. శ. 1530 వఱకు విజయనగర చక్రవర్తియగు శ్రీకృష్ణదేవరాయల కంకిత మొనర్చుటచే 16వ శతాబ్దములోనివాఁడు. అతఁడు రాయల యాస్థానములో 'అష్టదిగ్గజములు' అను ప్రతీతిగల కవీశ్వరులలో నగ్రగణ్యుఁడు.

పెద్దనకు 'ఆంధ్రకవితాపితామహుఁడు' అను బిరుదు కలదు. సభలో శ్రీకృష్ణదేవరాయ లాయన పాదమునకు స్వయముగా 'కవిగండ పెండేరము'ను దొడిగి గౌరవించెను.

ప్రవరుఁడను తరుణాగ్నిహోత్రి యొకఁ డెల్లప్పుడు నగ్నులఁ గాచుకొని యింటి పట్టున నుండుటచే, నాతనికిఁ దీర్థయాత్ర చేయు కౌతుక ముండెను. ఒకానొకనాఁడు, తాను తలఁచినచోటికి వెంటనే కొంపోవు శక్తిగల పాదలేప మను పసరు సిద్ధుఁడొకఁ డాతని పాదములకుఁ బూసి పోవఁగా, నాయోషధిప్రభావముచేఁ బ్రవరుఁడు హిమగిరికి వెళ్ళిన సందర్భమున నీ పాఠ్యభాగము ప్రారంభించుచున్నది.

చ. అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహు ర్లుఠ దభంగ తరంగ మృదంగ నిస్స్వన
స్ఫుట నటనానుకూల పరిఫుల్ల కలాప కలాపిజాలమున్
గటకచరత్కరేణు కరకంపిత సాలము శీతశైలమున్. 1

సీ. తొండము ల్సాఁచి యందుగుఁజిగుళ్లకు నిక్కు
కరుల దంతచ్ఛాయ గడలుకొనఁగ
సెలవుల వనదంశములు మూఁగి నెఱవెట్టఁ
గ్రోల్పులుల్ పొదరిండ్లఁ గుఱుక లిడఁగ
సెలయేటి యిసుకలంకల వరాహంబులు
మొత్తంబులై త్రవ్వి ముస్తె లెత్త
నడ్డంబు నిడువు నాపడ్డలగతి మనుఁ
బిల్లు డొంకలనుండి కేర్లిదాఁటఁ

తే. ప్రబలభల్లుక నఖభల్ల భయదమథన
శిథిల మధుకోశవిసర విశీర్ణ మక్షి
కాంతరాంతరదంతురి తాతపమునఁ
బుడమి తిలతండులన్యాయమున వెలుంగ. 2

క. పరికించుచు డెందంబునఁ
బురికొను కౌతుకముతోడ భూమీసురుఁ డ
గ్గిరికటకతట నిరంతర
తరు గహన గుహావిహార తత్పరమతి యై. 3

వ. గంగావతరణంబు, పార్వతీతపశ్చరణంబు, కామదహనంబు, కుమారజననంబు మున్నుగాఁ బురాణప్రసిద్ధచరితంబుల కాటపట్టు లగు పుణ్యప్రదేశంబులు హర్షంబున విలోకించి, ప్రవరాఖ్యుఁ డాత్మలోన. 4

చ. విలయకృశానుకీలముల వేఁడిమిఁ బోఁడిమి మాలి వెల్మిడిన్
గలసిన భూతధాత్రి మఱి క్రమ్మఱ రూపయి నిల్చి యోషధుల్
మొలవఁగఁ జేయు నట్టి నయమున్ ప్రబతికల్పము నెట్లు గాంచు నీ
చలిమలవల్ల నల్లసిలు చల్లఁదనంబును నూనకుండినన్. 5

సీ. పసుపునిగ్గులు దేఱు పాఁపజన్నిద మొప్పఁ
ప్రమథాధిపతి యింటిప ట్టెఱింగె
శచి కేఁత గఱపుచుఁ జదలేట సురరాజు
జలకేళి సవరించు చెలు వెఱింగె
నదనుతోఁ జేఁపి చన్నవిసి యోషధుల మ
న్నాదవు కొండల కెల్లఁ బిదుక నెఱిఁగె
వేల్పుటింతులలోన విఱ్ఱవీఁగుచు మేన
నవరత్నరచనల రవణ మెఱిఁగెఁ

తే. బరిపరివిధంపు జన్నంపుఁ బరికరంపు
సొంపు సంపద నిఖిలనిలింపసభయు
నప్పటప్పటికిని జిహ్వా త్రుప్పు డుల్ల
నామెత లెఱింగె నీతుషారాద్రికతన. 6

మ. తలమే బ్రహ్మకు నైన నీనగమహత్త్వం బెన్న నే నెయ్యెడన్
గలచోద్యంబులు చెప్ప గన్గొనియెదన్ గా కేమి నేఁ జేఁగెదన్
నలినీబాంధవభానుతప్తరవికాంతస్యంది నీహారకం
దళచూత్కారపరంపరల్ పయిపయిన్ మధ్యాహ్నముం దెల్పెడిన్. 7

తే. అనుచుఁ గ్రమ్మఱువేళ నీహారవారి
బెరసి తత్పాదలేపంబు గరఁగిపోయెఁ
గరఁగిపోవుట యెఱుఁగఁ డద్ధరణిసురుఁడు
దైవకృతమున కిల నసాధ్యంబు గలదె. 8

మ. అతఁ డట్లౌషధహీనుఁడై నిజపురీయాత్రామిళత్కౌతుకో
ద్ధతిఁ బోవన్ సపదిస్ఫుటార్తిఁ జరణద్వంద్వంబు రాకుండినన్
మతిఁ జింతించుచు నవ్విధం బెఱిఁగి హా నన్నిట్లు దైవంబ తె
చ్చితె యీఘోరవనప్రదేశమునకున్ సిద్ధాపదేశంబునన్. 9

క. ఎక్కడి యరుణాస్పదపుర
మెక్కడి తుహినాద్రి క్రొవ్వి యే రాఁదగునే
యక్కట మును సనుదెంచిన
దిక్కిది యని యెఱుఁగ వెడలు తెరు వెయ్యదియో. 10

మ. అకలంకౌషధసత్త్వముం దెలియ మాయాద్వారకావంతి కా
శికురుక్షేత్ర గయాప్రయాగములు నే సేవింప కుద్దండగం
డక వేదండవరాహవాహరిపుఖడ్గవ్యాఘ్ర మి మ్మంచుఁగొం
డకు రాఁజెల్లునె బుద్ధిజాడ్యజనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్. 11

సీ. నను నిముసంబు గానక యున్న నూ రెల్ల
సరయుమజ్జనకుఁ డెం తడలునొక్కొ
యెపుడు సంధ్యలయందు నిలు వెళ్ళనీక న
న్నో మెడుతల్లి యెం తొఁజలునొక్కొ
యనుకూలవతి నాదు మనసులో వర్తించు
కులకాంత మది నెంత కుందునొక్కొ
కెడఁ దోడునీడలై క్రీడించు సచ్ఛాత్రు
లింతకు నెంత చింతింతురొక్కొ

తే. యతిథిసంతర్పణంబు లే మయ్యెనొక్కొ
యగ్ను లే మయ్యెనొక్కొ నిత్యంబు లైన
కృత్యములఁ బాపి దైవంబ కినుక నిట్లు
పాఱవైచితె మిన్నులు పడ్డచోట. 12

క. నను నిలుసేరు నుపాయం
బొనరింపఁగఁ జాలుసుకృతి యొకఁ డొదవఁడొకో
యనుచుం జింతాసాగర
మున మునిఁగి భయంబు గదురఁ బోవుచు నెదురన్.. 13

సీ. కులిశధారాహతి ఘోలుపునఁ బైనుండి
యడుగు మోవఁగ జేగు రైనతటులఁ
గనుపట్టు లోయ గంగానిర్ఝరము వాఱఁ
జలువ యానయ్యేటి కెలఁకులందు
నిసుక వెట్టిన నేల నేచి యర్కాంశులఁ
జొరనీక దట్టమై యిరులు గవియు
క్రముక పున్నాగ నారంగ రంభా నాళి
కేరాది విటపికాంతారవీధిఁ

తే. గెరలు పిక శారికా కీర కేకి భృంగ
సారసధ్వనిఁ దనలోని చంద్రకాంత
దరులు ప్రతిశబ్ద మీన గంధర్వయక్ష
గానఘూర్ణిత మగు నొక్కకోనఁ గనియె. 14

ప్రశ్నములు

1. ప్రవరుఁడు హిమవంతమునఁ గాంచిన విశేషము లేవి?
2. హిమగిరిమహిమను బ్రవరుఁ డేమని కొనియాడెను?
3. ఔషధహీనుఁ డైన ప్రవరుఁ డేమని చింతించెను?
4. "ఒక్కకోనఁ గనియె" ప్రవరుఁడు గాంచిన యాకోన యెట్టిది?
5. తిలతండుల న్యాయ మన నేమి?
6. "బుద్ధి జాడ్య జనితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్." భావసందర్భములు వివరింపుము.

## విశేషములు

సమాసములను గుర్తించునది :—

నీహారవారి, నగమహాత్త్వము, మన్మోదవు, అరుణాస్పదపురము.

సంధులను గమనించునది :—

ముహుర్ముహుః, మరుదంబరములు, అకలంకౌషధము, దంతచ్ఛాయ.

వ్యాకరణవిశేషముల నెఱుంగునది :—

అప్పటప్పటికిన్, విజ్జుమీఁగు, నాదుమనసు, వేల్పుటింతులు.

రచన

ప్రవరుని హిమగిరి సందర్శనము సంగ్రహించి వ్రాయునది.



# 3. చాటువులు

చాటు వనఁగా రమ్యమైనది. ఏదోయొక సందర్భము పురస్కరించుకొని కవు లాశువుగాఁ చెప్పిన పద్యములకు 'చాటుపద్యములు' అను రూఢినామ మాంధ్రదేశమున వ్యాప్తిలోనున్నది. చాటుపద్య పఠన మాబాల గోపాలమునకుఁ గవిత్వమం దభిరుచి పుట్టించును. కొన్ని చాటువు లెవ్వరు చెప్పినవో తెలియదు. మఱికొన్ని యెవరోయొక కవి చెప్పిన వని ప్రతీతి యున్నను నిశ్చయముగా నాకవి దని చెప్పఁజాలము.

1. పద్యమునకుఁ జివరిపాదమో పాదభాగమో యిచ్చి పద్యము పూర్తి కావింపుమని కోరఁగాఁ జెప్పెడి దానిని సమస్యాపూరణమందురు. చివరిపాదము సమస్యగాఁ గొని రామాయణార్థము వచ్చునట్లు కవి పూరించిన దీపద్యము. ఆకవి యెవరో తెలియరాదు.

ఉ. చూచితి భూతలేంద్రి యొక చోద్యమృగం బని సీత పల్కఁగా
లేచి శరాసనాంబకము లీలఁగఁ జేకొని వ్రేయఁ బోవ మా
రీచుఁ డరణ్యవాటిని జరించెడు మాయలు రాముకంటికిన్
దోఁచుఁ నడంగు వెండియును దోఁచు నడంగు మెఱుంగుచాడ్పునన్

2. కొండవీటి ప్రభువగు కుమారగిరిరెడ్డికి కాటయవేమారెడ్డి బావమఱఁది. వీరుఁడు విద్వాంసుఁడు నగు కాటయ వేమునిగూర్చి యెవరో కవి చెప్పిన దీక్రింది చాటువు. ఇందులో క్రమాలంకారము రమ్యముగాఁ బ్రతిపాదింపఁ బడినది.

ఉ. మానుష దాన మాన బల మానితధర్మ రమా మనోజ్ఞ రే
ఖా నుతభూతి విత్తములఁ గాటయ వేమనఁ బోల్తు వాసవిన్
వానివిరోధి వానివిభు వానివిపక్షుని వానియగ్రజున్
వానిమఱంది వానిసుతు వానియమిత్రుని వానిమిత్రునిన్.

3. ఈక్రింది పద్యములో బక హంసముల సంభాషణము వ్యంగ్యముగాఁ జిత్రింపఁ బడినది. కవిపేరు తెలియదు.

ఉ. ఎవ్వఁడ వీవు కాళ్లు మొగ మెఱ్ఱన? హంసమ; నెందు నుందువో?
దవ్వుల మానసంబునను; దాన విశేషము లేవి తెల్పుమా!
మవ్వపుఁ గాంచనాబ్జములు మౌక్తికముల్ గల వందు; నత్తలో?
యవ్వి యెఱుంగ; నన్న నహహో యని నవ్వె బకంబు లన్నియున్

4. ఈ క్రింది పద్యము నమరావతి ప్రభువగు వాసిరెడ్డి వేంకటాద్రినాయని యశస్సునుగూర్చి పాపయారాధ్యుఁడో మఱియొక కవియో చెప్పిన చాటువు.

క. జలజారి కళలయందును
గలశాంబుధియందుఁ బన్నగప్రభునందున్
నెలయై యలయై తలయై
యలరెన్ నీకీర్తి వేంకటాద్రిమహేశా!

పశ్నములు

1. కాటయవేముఁడే యేగుణములలో నెవ రెవరితోఁ బోల్పబడెను ?

2. బకహంసముల సంభాషణము వ్రాసి, యందలి వ్యంగ్యార్థము వివరింపుము ?

3. వేంకటాద్రీశుని కీర్తి యెట్టిది ?

★

# 4. ఓరుఁగల్లు

శ్రీ దేవులపల్లి రామానుజరావు

(పచ్చ తోరణము)

శ్రీ దేవులపల్లి రామానుజరావు బి. ఏ., బి. యల్., పట్టము లందియుఁ బ్రభుత్వోద్యోగాదులు స్వీకరింపక స్వాతంత్ర్యసమరమునకు నాంధ్రసారస్వతసేవకు జీవిత మంకితముచేసిన తెలంగాణా వీరుఁడు. వీరు హైదరాబాదులోని ఆంధ్రసారస్వత పరిషత్తునకు ఉపాధ్యక్షులు.

ఈ పాఠ్యభాగము వారు రచించిన 'పచ్చతోరణము' అను ఖండకావ్య సంపుటి నుండి గ్రహింపఁబడినది. కవి స్వయముగా నోరుఁగల్లు వాస్తవ్యుఁడగుట యొక విశేషము.

సారస్వత నవనీతము, సాంస్కృతిక పునరుజ్జీవనము మొదలగు గ్రంథము లెన్నియో వీరు రచించిరి.

సీ. కాఁబోలు నియ్యది కాకతీయు లొకప్డు
కలికు నెత్తుటఁ గత్తి కడుగుచోటు
కాఁబోలు నీద్వారకల్యాణవేదిక
యలికి ముగ్గులు పెట్టెఁ దెలుఁగు పడుచు
కాఁబోలు నీజీర్ణకమనీయసౌధాన
సుకుమారశిల్పముల్ సొంపు లొలికె
కాఁబోలు నీవీథిఁ గాఁపురం బొనరించె
పైఁడిమేడలలోన భాగ్యలక్ష్మి

తే. ఇచటనే నిల్చి కాఁబోలు నిందుముఖులు
ఆయుధంబులు పూజించి యరుగుదెంచు
ఆంధ్రసేనకు కర్పూరంపుటారతులను
ఇచ్చి వారల శౌర్యంబు మెచ్చినారు.

సీ. ఆంధ్రనగరి యని యల్లారుముద్దుగాఁ
బిలిచె విద్యానాథుఁ డెలమి నీమె
అల్లుని స్వేచ్ఛకై నెల్లూరి నెఱజాణ
పఠియించె నిచటనే భారతంబు
జాను తెనుంగున శైవప్రబంధముల్
మొలకెత్తె యిచటనే మొగ్గ దొడిగె

సుందరమందార సుమదామ మొక్కటి
పోతన గ్రుచ్చె నీ పాలమునందు

తే. ఆర్ద్రహృదయాన నెందరో యాంధ్రకవులు
ఆలపించిరి యిచటనే యాత్మగీతి
తలఁచినంతనె మే నెల్ల పులకరించు
నక్కటా నాఁటి శోభ యేమాయె నేఁడు!

సీ. తిక్కనామాత్యుండు తెలుఁగుదేశపు రాజు
కలిసి మాటాడిన కొలు విదేమొ
అన్యదేశాధీశు లర్పించు కానుకల
నారాజు లిచటనే యందిరేమొ
కాటుకకన్నులఁగావ్యకన్యక నాఁడు
పోతన నిచటనే పోల్చె నేమొ
పురికొల్పెనో యేమొ పూఁబోఁడి యొక్కర్తు
రణరంగమున కేగ రమణు నిచట

తే. అనుఁగుమిత్రునితోఁడుత నాంధ్రనగరి
వీథిగడియారపున్మ్రోఁత విని యొకండు
పూఁటకూటింటి కల్లనఁ బోయి ముదము
గులుక విం దారగించిన స్థల మిదేమొ!

సీ. ఈచెర్వుగట్టున నాచరించెనో యేమొ
సమాగమనంబును సాధ్వి యోర్తు
ఆకోటబురుజుపై నతిశయించెనో యేమొ
యాత్మదేశంబుకై యాంధ్రుఁ డొకడు
తోడికోడండ్రతోఁ దొయ్యలి యొక్కర్తు
పూజించె గౌరి నీపొంత నేమొ
వేదశాస్త్రంబులు విడిది బ్రాహ్మణవీథి
చూడ్కి కిం పొనరించు చోటిదేమొ

తే. ఎన్ని సంపద లుండిన నేమి ఫలము
చచ్చిపోయిన యొకబత్తె యిచ్చెనంట

పగిలిపోయిన కుండెడు పాలు మాకు
నిద్దురను వీడు తమ్ముఁడా ప్రొద్దుపోయె! 4

సీ. రత్నాలు వజ్రాలు రాసులుగాఁ బోసి
యంగళ్ళ నిచటనే యమ్మినారు
పట్టు కంబళ్ళపై బంగారు నచ్చున
గాయల నాడిరి కాంత లిచట
ఉడుకురక్తము పొంగ హుంకార మొనరించి
యలరారె నిచట మా యాంధ్రసేన
బంగారమునుగూడఁ బండించిరంట మా
హాలికప్రవరు లీ యాంధ్రభూమి

తే. మా ప్రతాపనరేంద్రుని మానవతులు
వల్లభునిఁ గూడి యిచ్చటి మల్లెతోట
సిగ్గుతీవియ తొడఁగిన మొగ్గలగుచు
తూఁగుటుయ్యేలలందున నూఁగిరంట. 5

ప్ర శ్న ము లు

1. "అక్కటా! నాఁటిశోభ యేమాయె నేఁడు!" ఆ శోభ యెట్టిది?
2. ఓరుగంటిని గాంచినకవికిఁ గలిగిన చారిత్రక స్మృతులేవి?
3. "చచ్చిపోయిన యొకబత్తె యిచ్చెనంట, పగిలిపోయిన కుండెడు పాలు మాకు" సందర్భ మేమి? వివరింపుము.

వి శే ష ము లు

సమాసములను గుర్తించుము :-

తెలుఁగు పడుచు, తిక్కనామాత్యుఁడు, సిగ్గుతీవియ, ఇందుముఖి.

సంధులను గమనించునది :-

అన్యదేశాధీశులు, నరేంద్రుఁడు.

వ్యాకరణ విశేషముల నెఱుంగునది :-

పూఁబోఁడి, గడియారపుగ్రొమ్మెత, రత్నాలు, తూగుటుయ్యెల.

★

# 5. పాదధూళి

శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరి

(పతిగ పంట)

ఈ పాఠ్యభాగము శ్రీ తుమ్మల సీతారామమూర్తిచౌదరి రచించిన 'పతిగపంట' ఖండకావ్యసంపుటినుండి గ్రహింపఁబడినది.

ఈ కవి గురుకులవాసము చేసి సంస్కృతాంధ్రములు చక్కగాఁ బఠించి సుశబ్దములతో రసవద్రచనలు చేయు నాధునిక కవులలో నొకరు. వీరి కాంధ్రాభిమానము విశేషించి కలదు. తెలుఁగుపదముల కమ్మఁదనము, తిరుతిప్పలు లెఱిఁగి ప్రయోగించువారగుటచే వీరికి 'అభినవ తిక్కన' అను బిరుదము వచ్చినది. 1949 లో వీరికి కవి పండిత సమక్షమున 'కనకాభిషేకము' జరిగినది.

ఉభయభాషా ప్రవీణపట్టమునంది యెన్నియో ఉన్నతపాఠశాలలలో నాంధ్రాధ్యాపకులుగా నుండి ప్రస్తుతము వీరు అప్పికట్ల ఉన్నతపాఠశాలలోఁ బనిచేయుచున్నారు. వీరు రచించిన ఇతరకృతులు, రాష్ట్రగానము, ఆత్మకథ, ధర్మజ్యోతి, అమరజ్యోతి ఇత్యాదులు.

హిందూ మసల్మానుమైత్రి సాధించుటకు గాంధీమహాత్ముఁడు చేసిన నవకాళీ యాత్రాసందర్భమున జరిగిన యొకఘట్టము నీ పాఠ్యభాగము వర్ణించును.

తే. తరలెను ఋషిరాజు 'రాంపుర' ద్వారవేది
బలసె నాబాలవృద్ధప్రపంచ మతని
నెరసె నాశాద్యుతుల్ ప్రజానేత్రవీథి
మొరసె జయజయధ్వని దిశామూలల మదరఁ
గురిసె యోగీంద్రు శిరముపై గుసుమవృష్టి.

పౌరు లేతన్మహోజాత పారవశ్య
మగ్నులై యున్నవేళ డింభకుఁ డొకండు
పరుగుమై వచ్చి తత్సభాప్రాంగణమ్ము
డాసి జర్జరితమ్ము కూర్పాస మూడ్చి
మూటకట్టఁ దొడంగె నచ్చోటి దుమ్ము.

ఏమిరా వెఱ్ఱి పాపఁడా! యీ ప్రజాస
ముద్ర మిటుల పొంగి మిన్నులు ముట్టుచుండ
దృష్టి సారింపవైతి వా దిశకు నీవు
సాగి దర్శింప వా కర్మయోగిచంద్రు
నేల ముడిచెద వీ పాంసుజాల మిచట.

అయ్యగారూ! నమోవాక మమ్మహాత్ముఁ
గంటి నేనఃపిశాచికం గదలు మంటి
హరిజనత్రాత నాస్వామి యడుగు సోఁకి
పరమపావిత్ర్యలక్ష్మివిభాసి యైన
యీ రజోరాశి జననికై యెత్తుచుంటి.

అమ్మ, నన్నిసదస్సున కనుచు వేళ
దివ్యపూరుషచరణబాంధవ్య మంది
పతితపావనపాద సంపర్క మంది
సుకృతసురభిళ మైన పాంసువును దెచ్చి
యస్మదీయము పరితాప మార్పు మనియె.

ము న్నొకమహాత్మ నడుగుదుమ్మునకు నోఁచి
కఠినశిల పూవుఁబోఁడి యై కదలెనంట
ఘోరజానుషబంధముల్ కోసెనంట
బాబయా! యిమ్మహాత్ముని పదము నంటు
దుమ్ముచే నెంటలేమె మా దుర్విపత్తి.

## ప్ర శ్న ము లు

1. మహాత్ముని రాకచే 'రాంపురము' నందలి జనులలో విరిసిన యానందమును వర్ణించునది.
2. బాపూజీని సందర్శింపవచ్చిన యొకానొక డింభకుఁ డొసర్చిన దేమి ?
3. "ఏల ముడిచెద వీ పాంసుజాల మిచట" అను ప్రశ్నమున కాబాలుఁ డొసఁగిన సమాధాన మేమి ?
4. వృద్ధమాత కుమారుని సదస్సున కంపుచు నతనితో నేమి చెప్పెను ?
5. మహాత్ముల పాదధూళి మహిమ యెట్టిది ?

## విశేషములు

సమాసములను గమనించునది :—

ఆబాలవృద్ధప్రపంచము, కుసుమవృష్టి, సుకృత సురభిళము, జానుపబంధముల్.

సంధులను గమనించునది :—

ఏతన్మహోజాతము, ఏనఃపిశాచిక, రజోరాశి, దుర్వ్యాప్తి.

వ్యాకరణ విశేషముల నెఱుంగునది :—

మహాత్మ్మసడుగుదుమ్మ్మ, పూవుఁబోఁడి, ఇమ్మహాత్ముఁడు,

ఈక్రింది పదములను వాక్యములలో నుపయోగించునది :—

మాట కట్టు, మిన్నులంముట్టు.

# 6. కవితా సామగ్రి

శ్రీయుతులు పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వేంకటేశ్వరరావు

( తొ ల క రి )

ఈ పాఠ్యభాగము శ్రీయుతులు పింగళి లక్ష్మీకాంతము కాటూరి వేంకటేశ్వర రావులు రచించిన 'తొలకరి' యను కావ్యసంగ్రహమునుండి గ్రహింపఁబడినది.

వీరుభయులు శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవుల శిష్యకోటిలో నగ్రగణ్యులు. శ్రీ పింగళి లక్ష్మీకాంతము ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో ప్రధానాంధ్రాధ్యాపకులుగా నుండి పలువురు పండిత శిష్యులను పుడమిఁ బ్రసాదించి యుద్యోగమునుండి విరమించి విశ్రాంతి తీసికొనుచున్నారు. శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు స్వాతంత్ర్య సమరములోఁ బాల్గొని కొంతకాలము కృష్ణాపత్రిక సంపాదకులుగా నుండిరి.

వారు రచించిన యితర గ్రంథములు 'సౌందరనందము' మున్నగునవి.

'కవితాసామగ్రి' తొలకరిలోఁ బ్రచురించిన ఖండకావ్యములలో మొదటిది. సత్కవిత్వము రచింపని విరసులకు కాంతాసమ్మితముగాఁ గవితాస్వరూపము ఇందులో నుపదేశింపఁ బడినది.

సీ. చూతురా? దీనిని జూతపల్లవఖాది
  నిపికాంగనా గానవిస్వనంబు
కొందురా? దీనిని గ్రొమ్మెఱుంగుల జిల్గు
  పనికిఁ గాఁదగిన కుందనపుఁదళ్కు
కావలెనా? యిద్ది, కలువపూరేకు
  పొత్తములఁ జిప్పిలెడు మెత్తందనమ్ము
వలయునా? మలయపర్వతసానువులనుండి
  దిగుమతి యగు కమ్మతెమ్మెర లివి.
తే. తీయుదుర? దీని వెన్నెల తేట నిగ్గు
ఒఱయుదర దీనిఁ బచ్చకప్పురపుఁ దావి
కోరికొందురా, దీనిఁ బటీరజలము
త్రావి చూతురా, తీయని పూవుఁదేనె. 1

మ. చనుదెం డో కవులార! మీరు కవితా సామగ్రి వాంఛింతురే
సనుచున్ బందరుపేఁటలన్ దిరుగు బేహారిన్ విలోకించి తె

చ్చెనురా కైతము లమ్మకాన కని వచ్చెన్ గావ్యకృన్నాషసా
ధనచింతాపరుఁ డొక్కరుండు బుజముల్ దాటించుచున్ వీథికిన్.

ఉ. రచ్చకు వచ్చి యోయి యిటురమ్మని పిల్చి కవిత్వవస్తువుల్
తెచ్చితివా కనుంగొనెదఁదీయుముమూఁత లటం చొకొక్కఁడున్
విచ్చి, సకౌతుకాద్భుతపు వీక్షలఁ జూచుచు నీసడించి పో
వచ్చు, నివేటి వస్తువులు వర్తకుఁడా! యని నవ్వి యిట్లనున్. 3

మ. కపురంపుం బలుకల్, తుషారజలముల్ కల్వల్ పికధ్వాన మ
చ్చపు బంగారము, పూవుఁదేనియలుజ్యోత్స్నల్ చల్లగాలుల్, కవి
త్వపు సామగ్రి యటంచుఁ జూపెదు కవిత్వం బన్న నెట్లుండునో
యెపుడుం జూడని వానికింబలెనె పోమిర్మా చాలు సంతోసమే. 4

సీ. ప్రౌఢసమాసకల్పన మున్న నీయొద్దఁ
జూపుమీ యని చేయి చాపె నొకఁడు
శ్లేషకవిత్వమంజూష నీకడ నున్నఁ
గొనియెద నేనంచుఁ గొసరె నొకఁడు
సత్కావ్యరచనారసాయనం బున్నచో
నీబుడ్డి నింపు మం చిచ్చె నొకఁడు
ఆశుకవిత్వము సల్లు మంత్రము లున్న
నూదుమీ యని చెవి యొగ్గె నొకఁడు

తే. ఫారసీ మెట్లు వ్రాయంగఁ బనికివచ్చు
ఫణితు లేమేని యున్నచోఁ బయటఁబెట్టు
మంతియే కాని, కవనదాహమ్ముఁ దీర్ప
ఖుంచునీ శ్లేల యని కోపగించె నొకఁడు. 5

తే. ఇట్లు లెగఁబడువారిఁ గన్నెత్తి చూచి
అంగడిని సర్దుచున్ సెట్టి యన్నలార
దండ మిడుదును, నన్నుఁ బోనిండు లెండు
మందుమాకు లీ యంగడియందు లేవు. 6

చ. ఎఱుగక వచ్చినాఁడ క్షమియింపుఁడు వేఱొక పేటయందు నే
ర్పరులుగలారు వారు నను రమ్మని మాటికిఁ జీరుచుందు రేఁ
బోరపడి వీని నమ్మెదనుబో! తమబోంట్లకు లాభ మేమి? నా
సరకుల పేరుకూడఁ జెడుఁ జా లని సాగె మఱొక్కచోటికిన్. 7

ప్రశ్నములు

1. బేహారి తెచ్చిన కవితావస్తువు లేవి? అవి యెట్టివి?
2. కావ్యసాధకుఁ డా కవితావస్తువుల నేమని యాసడించెను?
3. అచటివారు కోరిన కవితావస్తువు లేవి?
4. విసివిన బేహారి కొనవచ్చినవారితో నన్న దేమి?
5. ఈ ఖండకావ్యము వ్రాయుటలో కవుల యభిప్రాయ మేమి?

విశేషములు

సమాసములను గుర్తించునది :-

పికాంగన, పూవుఁదేనియలు, కవనదాహము, తుషారజలము.

సంధులను గమనించునది :-

కావ్యకృన్నామసాధనము, లతాంగి.

వ్యాకరణ విశేషముల నెఱుఁగునది.

క్రొమ్మెఱుంగు, కప్పురంపుఁబలుకుల్, వాంఛింతురు.

ఈ క్రింది పదములను వాక్యములలో నుపయోగించునది :-

మంచుమాకులు, బుజముల్ దాటించు, చేయి చాచు.

*

# గద్య భాగము

## 7. సంజీవకుని సఖ్యము

పరవస్తు చిన్నయసూరి

(నీతిచంద్రిక, మిత్రభేదము)

పరవస్తు చిన్నయసూరి (1806-1862) క్రీ. శ. 19వ శతాబ్దములోఁ జెన్నపుర మలంకరించిన పండితులలో నగ్రగణ్యుఁడు. కాశినుండి వచ్చిన తర్కమీమాంసా పండితుల పరీక్ష కాగిన పిమ్మట స్వర్ణకంకణ ప్రదానపురస్సరముగ 'సూరి' యను బిరుద నామ మీయన కీయఁబడినది. పద్యకవితకు నన్నయనువలెనే గద్యకవిత కాద్యుఁడని వీరేశలింగము పంతులు, వేంకటరత్నము పంతులువంటి విద్వాంసులే యీతనిఁగీర్తించిరి.

ఇతఁడు రచించిన యితర గ్రంథములు, బాలవ్యాకరణము, సూత్రాంధ్ర వ్యాకరణము, ఆదిపర్వవచనము, ఇత్యాదులు.

నీతిచంద్రిక పంచతంత్ర హితోపదేశముల నాధారముగాఁ గొని చిన్నయసూరి రచించిన గద్యకావ్యము. అందులోని మిత్రలాభము, మిత్రభేదము అను రెండు భాగములు మాత్రమే సూరి రచించెను. వానిలో మిత్రభేదమునుండి యీ పాఠ్యభాగము గ్రహింపఁ బడినది.

అనంతరము రాజపుత్త్రులు విష్ణుశర్మతో నిట్లనిరి : ''స్వామీ! మీయనుగ్రహమువలన మిత్త్రలాభము వింటిమి. ఇంక మిత్త్రభేదము వినఁగోరెదము,'' అనిన విష్ణుశర్మ యిట్లు చెప్పఁదొడఁగెను.

ఒకవనములో సింహవృషభములు మిక్కిలి చెలిమిగలిగి యుండెను. ఒక మాయావియయిన గోమాయువు వానికి విద్వేషము పుట్టించి, సింహముచేత వృషభమును జంపించెను. ఆకథ మీకు సవిస్తరముగా వినిపించెదను. సావధానముగా వినుండి.

దక్షిణాపథమందు రత్నావతి యను పట్టణముగలదు. అందు వర్ధమానుఁడను సార్థవాహుఁడు వాసముచేయుచుండును. అతఁడు తనకంటె సంపన్నులయిన తనబంధువులను జూచి వారికంటె మిక్కిలిగా ధనము సంపాదింపవలె నని యెంచి యిట్లు చింతించెను :

'అర్థము పురుషార్థములలోపల నుత్తమము. అర్థవంతున కసాధ్యము లోకమందేదియుఁ గానము. ధనార్జనమునకు సాధనములు పెక్కులుగలవు. వానిలోపల వాణిజ్యము సర్వప్రకారములచే మేలయి కానఁబడుచున్నది,' అని విచారించి పరదేశమునకు వలసిన తన దేశ మందలి మేలిసరకులు సేకరించుకొని, పెక్కుసరకులు బండ్లమీఁద, గుఱ్ఱములమీఁద, వేసడములమీఁద నెత్తించి, కొన్నిటికి భారవాహు లను నియమించి, మంచికంచర మొకటి సిద్ధముచేసికొని దానిని సంజీవ కనందకములను నెఱ్ఱిలను బూన్చి యెక్కి, సముచిత పరివారముతో నుత్తరదేశమునకుఁ బయనమాయెను. ఇట్లు బయలువెడలి కడు దూరము గడచి సుదుర్గమను పర్వతముచేరువ కాంతారమందుఁ బోవు చుండఁగా, సంజీవకము కంచరమును లాగఁజాలక లాగుచు, జాఱి, మోఁకాలువిఱుగ, నేలఁబడియె. అంత నావర్తకుఁడు కంచరముదిగి, శీఘ్రముగా సంజీవకము మెడకాఁడికట్టు వదలించి, రెండవయెద్దును విడువఁబంచి, తన సరకుబండ్లు కావళ్లు మొదలయినవి వారిసాగిపో సెలవిచ్చి, తన కొంతపరివారమును గంచరమునకు బళికరముంచి, యక్కడకు సమీపమందున్న ధర్మపురమను గ్రామమునకుఁ బోయి, పోతరించి లావుగలిగిన యొక యెద్దును విలిచి తెచ్చి, కంచరమునకుఁ గట్టించుకొని సాఁగిపోయెను.

తరువాత, నాకాటియందు సంజీవకము భాగ్యము మంచిది కాఁబట్టి, క్రూరసత్వముల బారికిఁదప్పి, విఱిగినమోఁకాలు చక్కఁబడి లేచి నడయాడసాగెను. ఆయువు గట్టిగానుండెనా, మహామృత్యువు వాతఁ జొచ్చియయిన మరలిరావచ్చును. కాలము సమీపించెనా, కోటివేల్పు లయిన మరణము మానుపఁజాలరు. పిమ్మట నావృషభము వనములో విచ్చలవిడిగాఁ దిరుగుచు, నానాఁడు మంచిపచ్చికమేఁత కడుపార దొరకఁబట్టిలెస్సగాబలిసి, యొకనాఁడు పర్వతగుహలు మాఱు మ్రోఁగ గణిల్లని ఱంకెవేసెను.

ఆకాననమందుఁ బింగళకమను సింహముగలదు. అది పుండరీక ములఖండించుచు, సలుగుల నలుగులంబడఁ జేయుచుఁ, గాసరముల మీఁగరము గాసించుచు, ఋక్షముల శిక్షించుచుఁ, దక్కిన మృగముక్కడి

మృగముల లెక్కింపక, యిచ్ఛకువచ్చినట్లు విహరించుచు, నాఁడు డప్పివడి, పిపాసితమై, యమునాకచ్ఛమునకుం బోయి, ప్రలయ సమయపర్జన్యగర్జానుకారి యయిన సంజీవకము భీషణఘోషణము విని, వెఱఁగుచే, రాపడి నిలుచుండెను. ఆ యరణ్యమందుఁ గరటక దమనకములను జంబుకములు గలవు. కరటకుఁడు దమనకునితో ముచ్చటలాడుచుండి, సంజీవకమురావము విని యదిరిపడి, గుండెలు తటతటఁ గొట్టుకొనఁ గొంతవడికి సంబళించుకొని, యావలనికిఁ గ్రేగంటిచూపు నిగుడించి, చెవినిక్కించి యాలించి, యిట్లనియె: 'మఱి సద్దుగానము. నీవును వింటివిగదా? ఇదియేమి? ఇంతకాల మాయెను ఈయరణ్యములో నున్నారము. ఇట్టి బెట్టిదపుఁగూత యెన్నడుగాని విన్నదిలేదు,' అనిన దమనకుం డిట్లనియె: 'ఔనౌను. ముందు విన్నదిగాదు. ఈశబ్దము మహాశ్చర్యము. అదిగో చూడు! మనరాజు పింగళకుఁడు యమునాకచ్ఛమునకుఁ బోవువాఁడు రాపడి నిలుచున్నాఁడు. ఆధ్వని విని కాఁబోలు,' అని చిఱునవ్వునవ్వి, 'యెంతవాఁ డట్లాయెను. మనమనఁగా నెంతవారము?' అనినఁ గరటకుం డిట్లనియె: 'ఇట్టి బెట్టిదపు టులివు గావించినజంతువు కొంచెపాటిగా నుండదు. ఎక్కడనుండి వచ్చి యాజంతు వీ వనము చేరినది? ధ్వని మాత్రమువిన్నారముగాని, యాజంతువునుగానము. నిన్నమాపో నేఁడు ఱేపో యిక్కడ కది వచ్చి చేరియుండును. ఇంక నేమి యిడుమపాటు రానున్నదో యెవ రెఱుఁగుదురు?' అనిన దమనకుం డిట్లనియె: "ఈ యరణ్యము మనకు మాస్వక్షేత్రమా? లాఁతిచోటికిఁ బోఁగూడదని నియమమా! మఱి యరణ్యములేదా? అభిజన మెవ్వరికిఁగాని దుస్త్యజమే. అట్లని చావున కొప్పుకోవచ్చునా? ఈవిచారమేల! ఇప్పుడు మనకు వలసదీయునంత యిడుము యేమివచ్చినది? ఈవఱ కాజంతువు నల్లనిదో తెల్లనిదో యెఱుఁగము. అది క్షుద్రజంతువో మహాజంతువో ముందు తెలిసికొని, పిమ్మటఁ గర్తవ్యము విచారింతము. పిట్టకొంచెము కూఁత ఘన మన్నట్లు క్షుద్ర జంతువునకు సయితము పెద్దనో రుండ వచ్చును. జంతు వంతబెట్టిదము గాదనుటకు నాకు సూచన కొంత గానఁబడుచున్నది. నీవును జూడుము. ఆవంక జంతువులు కలగుండు

వడిన లక్షణ మేదియుఁ గానరాదుగదా? మంచిది, యాలకింపుము. క్షోభ మేమాత్రము పుట్టిన నలబలము వినరాకుండునా? అనినఁ గరటకుం డిట్లనియె; 'అవు నది నిజమేకాని కడపట నది యిట్టి జంతువు కూఁత యని మాత్ర మాకళింతకు రాలేదు,' అని చెప్పి కొంతదడ వూరకుండి, చిఱునవ్వు నవ్వి యిట్లనియె: 'ఇప్పటికి స్మరణకు వచ్చినది. మఱి యేమిగాదు వినుము కొన్నాళ్ళకు మునుపు వర్తకుఁ డొకఁడు దారిని బోవుచుండి యీకువఁజాలక యీడిగిలఁబడిన యొక బక్క యెద్దును బ్రయాణత్వరఁబట్టి యీయడవిలో విడిచిపోయినాఁడు. అది యీకాటిలో గడ్డిపరకలు కొఱికి తేఱుకొని, కొంత చియ్యఁ బట్టి, యక్కడక్కడ నట్టాడఁగాఁ జూచితిని. ఇప్పుడు మనము విన్నది దానిఱంకె. దానికి సందేహములేదు. ఊరక యీవఱకుఁ బనికి మాలిన పిఱికితనము తెచ్చుకొంటిమి. మనకంటె శూరుఁడు మన రాజు,' నావుడు దమనకుం డిట్లనియె: 'మనము పింగళకునకు మంత్రి పుత్త్రులమై యుండి యిప్పు డొప్పరికింపరాదు. డాయఁబోయి యాతనిభీతి మానింతము. ఈ నెపముచేత నాతనికొలువు సంపాదించు కొని యనుగ్రహము పడయవచ్చును. రాజానుగ్రహముఁ బొందిన వానికి సర్వసంపదలు గలుగును. మన మాతని తొంటి నిగ్రహము పాటింపరాదు. మనకుఁ దదనుగ్రహ సంపాదనము ముఖ్యముగాని తక్కిన మోఱకుఁదన మేల?' అనినఁ గరటకుం డిట్లనియె: 'దమనకా! వినుము. ఈతని సంగతి నాకు సరిపడదు మునుపు కొలువుండి పడ్డపాట్లు చాలును. ఈతఁ డెత్తువారి చేతిబిడ్డగాని యొక తెన్నునఁ బోవువాఁడు గాఁడు. ఇట్టివాని కొలువు మిక్కిలి కష్టము. అది యుండనిమ్ము ఉదరపోషణమునకయి పరులకు శరీర మమ్ముకొనుట మిక్కిలి హేయము. పరాయత్త వర్తనుఁడు మృతకల్పుఁడు అయినను సేవకుఁడు స్వకృత్యములయందు స్వామిచేత మన్ననం బడసెనా సేవాదుఃఖము కొంత నిస్తరించును. ఉపేక్షితుఁ డయ్యెనా దానికంటె దుఃఖము లేదు. పరాభూతుఁడయ్యెనేనిఁ జెప్పవలసినదేమి? సేవావృత్తిచే వచ్చు పాయసముకంటె స్వచ్ఛంద వృత్తిచే లభించు గంజి మేలు. కాఁబట్టి ప్రాప్తలాభముచేఁ దృప్తిపడి సుఖముండుదము.

ఇప్పుడాతని భీతి మానుపవలసినజోలి మన కేమి గలదు? అక్కడక్కడఁ బసరముల డొక్కలు వెదకుట మనకార్యము. అది మాని, యీవిచార మేల? భక్షితావశిష్ట మయిన మాంసము కావలసిన యంత యున్నది. రా, రా, భక్షింతము."

అనిన దమనకుఁ డిట్లనియె: 'ఇప్పుడు త్వరయేల! మెల్లగాఁ బోయి భక్షింతము. ఎల్లజంతువుల కాహారనిద్రాభయములు సహజ ధర్మములు. కుక్షింభరిత్వముచే గౌరవము రాఁబోదు. మిత్రామిత్రుల కుపకారాపకారములు చేయవేఁడి, బుద్ధిమంతులు రాజాశ్రయము గోరుదురు. స్వోదరమాత్రము భరియింప నేను లేఁడు? ఏవాఁడు జీవింప ననేకులు జీవింతురు వాని మనుగడయే సఫలము. వాఁడొకఁడ జీవించువాఁడు ఆమిషశూన్యమయి వసాగంధిలమైన శల్యము దొరకిన మాత్రాన, వేఁపి మిక్కిలి సంతోషపడును; కాని దానిచే దాని యంగద గొంతయైన నడంగదు. కేసరి యాసన్నమైన మ్రుక్కడి మృగమును లెక్కింపక నిజఖరనఖరవిదారితహస్తి మస్తమస్తిష్కము కోరును. ఎల్లవారు సత్త్వానురూప మైన ఫలమె వాంఛింతురు. శునకము తన కోగిరము పెట్టువానికడఁ జేరి తోఁకాడించును. నేలఁబడి నోగు కడుపుచూపును. ఇన్నిపాట్లువడు కుక్కకొక్క ముద్ద వంటకము కంటె మిక్కిలి పెట్టరు. ద్విరదము కరము ధీరముగా విలోకించుచు, సారె కాధోరణోపలాలితమై మెల్లగాఁ గబళము గొనియెడిని. హీనుఁ డెంతదీనభావముతో వేఁడినను వాని కెవ్వరును దనియఁబెట్టరు. గౌరవము గలవానికి వినయవచనములతోఁ గోరికకు మీఱు నిత్తురు. అనవద్యమగు విద్యచే నవక్రమగు విక్రమముచే నిరపాయమైన యుపాయముచే, నృపాలుర మెచ్చువడసినవాని మనుగడయే మనుగడ. శునకము సయితము కమికెఁడన్నము దిని మనలేదా? గఱువతనము మానక, తనకలిమికొలఁదిని లాఁతులకు మేలొనరించువాని జీవన మొక్కనాఁటిది యయినం జాలును. స్వోదరమాత్రపూరక మగు కరటము చిరకాలము మనిన ఫలమేమి? అలఁతిజలముచే మొరపనేల వెల్లివొడిచినట్లు కొలఁది లాభముచే క్షుద్రునందు హర్షము వొడమును. హితాహితవివేకము లేక విహితకర్మములు మాని స్వోదరమాత్రము పూరింపఁ గోరువాఁడు

పశుతుల్యుఁడు. అంతియకాదు. భారవాహి యయి, తృణమాత్రాశన మయి, కృష్యాదికర్మముల కత్యంతోపకారక మయి, పవిత్రజన్మ మయిన వృషభము నరపశువుకంటె మేలుగాదె?'

నావుడుఁ గరటకుఁ డిట్లనియె: 'రాజసేవవలని ప్రయోజన మెఱుఁగనివాఁడఁ గాను. తొల్లి యీతనివలనఁ బడ్డపాట్లు తలఁచు కొన్నమాత్రానఁ దల కంటగించుచున్నది. కాఁబట్టి యట్లు వచి యించితిని. భృత్యుల గుణదోషములయందు వివేకము చాలని రాజును గొలుచుట దుష్కరము. నీవు వివేకివి. అన్యులచేతఁ జెప్పించుకొనవలసిన యర్థము నీకొకటి లేదు. ఉచితమయినట్లు చేయుము. ఇప్పుడు నీవు చేయఁబూనిన కార్యమేమి?' నావుడు దమనకుఁ డిట్లనియె.

"మనరాజు పింగళకుఁడు జలపానార్థము కాళిందికిఁబోయి, యెద్దు అంకెవిని భయపడి, తీర్థావతరణము మాని వెఱఁగుపడియున్నవాఁడు. పరహృదయము ప్రత్యక్షముగాదు. కాఁబట్టి యాతని చిత్తవృత్తి నీవెట్లు తెలిసికొంటి వనఁబోకు. ఈ యర్థ మాతని యాకారముచేతనే నా కవగత మయినది. ధీమంతునకుఁ బరులభావము సుగమమై యుండును. కర్తవ్యాంశము వినుము. నేనిప్పుడు రాజుపాలికిఁబోయి, తద్భావానురూపముగా ననుసరించి, వలసిన మాటలాడి, యీకార్యము నీవుచేయుమని యాజ్ఞాపింపఁజేసికొని, మనసునకెక్కఁ బ్రవర్తించి, యాతనిమన్ననలు వడసెదను."

అనినఁ గరటకుఁ డిట్లనియె: 'రాజులకొలువు గోరువారు మెలఁకువ గలిగి ప్రవర్తింపవలెను. వారి చిత్తవృత్తి యెఱిఁగి మెలఁగుట కడిఁది. నీకుఁ గార్యసిద్ధి గావుత. అదె తేఁడును మరలి తనయిరవు నకుఁ జనుచున్నవాఁడు. అతఁ డిరవు చేరునంతకు నీవుంబోయి దాఁకొన వచ్చుఁ బొమ్ము.

నావుడు దమనకుఁడు పింగళకునిపాలికిం బోయి, యడఁకువ తోడ నొఁదుగుపాటున నిలచి, భయభక్తులు పిరిగొనఁ దొట్రువడుచు, జోహారు వొనరింప, మృగేంద్రుఁ డతని సాదరంబుగ వీక్షించి,

కూర్చుండ నియమించి, 'కుశలమా? బహుకాలమునకు నిన్నుఁ జూడఁ గలిగె' నావుడు దమనకుం డిట్లనియె :

'దేవా! తావకం బగు నపాంగావలోకంబునకుం బాత్రంబైన యీవనక్షేత్రంబున జంతుసంతానంబుల కావంతయేనిఁ గొఱంత కుశలంబునం గలుగదనం దావక సేవకులగు మావంటివారి కయ్యది యడుగం బనియేమి? అవసరంబగుడు సేవకుం డనాకారితుండయ్యు రావలయుఁగాదె? స్వామికిం దఱి యెఱిఁగి భృత్యుండు హితాహితంబు లెఱిఁగింపవలయు. ఉపేక్షకుం డయినం బ్రియవాది యయినను స్వామిద్రోహియగు. స్వామిద్రోహికి సర్వశ్రేయంబులు చెడును. సదసద్వివేకసంపన్నుండయిన ప్రభువునకు మాబోఁటి క్షుద్రులవలన నరయం దగినయర్థం బొకటిగలదే యని విచారింపఁ బనిలేదు. చక్షుష్మంతునకే దీపంబుగాని, యంధునకుం గొఱ యగునె? చిరకాలం బేలినవారిపాదంబుల కొలువుసేయుచున్న మాబోంట్లు మ్రుక్కుడులయ్యు విద్యావివేకసంపన్నులగుట సన్నిధాన ప్రభావంబు చేతంగాదె? స్వామికిక్షేమంబు గాంక్షించుభృత్యుం డప్రాప్తానుయోగుఁడయ్యుం దఱియెఱింగి వలయునర్థంబు వచింపవలయును. అయినను స్వామి చిత్తంబునకు వేఱొండుగఁ దోచునేమోయని మనంబు తేకువం బొరసెడు,' నావిని పింగళకుండు:
'దమనకా! నీవు మాకు హితభృత్యుండవు. నీవచనంబు మాకవశ్యగ్రాహ్యంబు. మేము నీకుఁ గ్రొత్తవారమే? ఏల జంకువడియెదవు? నీయిచ్చవచ్చిన చొప్పునం జెప్పవచ్చును,' నావుడు దమనకుండు కరంబున నోరు మూసికొని, యావచనంబు లాలించి, బుద్ధి బుద్ధి యని, 'దేవా! యింతకుం గొంతముందు యమునాకచ్ఛంబునకుం బోయి, యచ్చట ఱిచ్చవడిన తెఱంగు దోపం గొంతసేపు చిత్రరూపంబుపగిదిం జూపట్టి, మరలి, యిరవున కరుదెంచితిరి. ఇందులకు నిమిత్తంబు గానక చిత్తం బుత్తలంబు నొందెను. అయ్యది చెప్పవచ్చునని దేవరచిత్తంబునకుం దోచిన, సేవకుండు వేచియున్నవాఁడు,' నావిని పింగళకుండు, 'దమనకా! విను. మాకు నీవు పరమాప్తుండవు. నీకు దాఁపురముచేయు నర్థము మాయం దొకటియైనఁ గలుగదు. అఖిలసత్త్వశరణ్యంబయిన యీ యరణ్యంబు మదధీనంబు. ఈ దేశంబున

నా యాదేశంబునంగాక యాకయినం గదల వెఱచు. వింటివా, నేఁ డొక్క విపరీతంబు! పిపాసార్దితుండ నయి యమునాతరంగిణి కరుగుచుండ నఱుము తెఱంగున మొరపం బొక్కటి కర్ణ గోచరం బయ్యె. ఆనినదంబు వినిన చోటనె వితాకువడి నిలిచితిని. ఇసుమంత యయిన నంతరంగంబున భయంబునం బొరయక యిట్లు ఘోరంబయిన యారావంబు గావించిన జంతు వలంతిగ నుండదని చింతించెద. లోకంబున నుత్తముండగు శూరునకుం బరప్రకర్షంబు సహ్యంబగునే? అలంతివాని నేనిం బగవాని నొప్పరికింపం జనదన లాంతివానిఁ జెప్పనేల? ఎట్టివాని కేనిం బలదర్పంబునఁ బగతునొప్పరికించునట్టివాని కశక్తిభీరుత్వంబులు లోకు లారోపింతురు. వలదని నాకొనకుండ మిఱుఁకుట నోళులు గ్రమ్మవచ్చునే? ఇట్టిపడి వడుకంబె నొడలు విడుచుట మేలుగాదె? ఊరక దొరుకంబోఁ బోరనది శ్రేయోదాయకంబయి యుండు. దైవయోగంబున మాఱుతుండు దొరెనేనిం గడు మేలయ్యె. కావున నిప్పుడ దాయవయినొండెఁ బోవుదము. అరాతి నిరాసంబ పరమార్థంబుగం గోరితిమేనిం దదుపాయాన్వేషణం బావశ్యకంబు. బలవంతుం బగతు నుపాయంబుచేతన సాధింపవలయును. కావున నిప్పటికిఁ దొలంగి చని, కాలదేశోచితంబుగ వలయు నుపాయంబు సముపార్జించి కొని, విపక్షు శిక్షింత మొండె. ఇందు నీ కెయ్యది పోలియున్నయది చెప్పు' మనిన దమనకుండు కొంతవడి చింతించి, 'తుదముట్టఁ గారణంబు దెలియక తమకింపరాదు. శబ్దమాత్రంబునన నివ్వెఱఁ బొరయం జనదు. స్వామి ముదలయిచ్చినం జాలును. ఈక్షణంబ యాచప్పుడుప్పతిల్లిన చాయకుం బోయి తత్కారణం బారసి నీలెంక రాఁగలండు,' అనినం బింగళకుం డాతని మొగం బట్టెచూచి, కొంత చింతించి, 'యిదియ యిప్పటి కుచితంబని తోచుచున్నది. కరంబు పరికింపక యేకార్యంబున కేనిం దమకింప లగ్గుగాదు. ఎదిరిసమ్ముఖంబున మాటలాడ నూటివడెనేని బలాబలంబులకొలది యెఱింగి తత్కాలోచితంబుగ నాపుచ్చినమాటలుగ నాడవలసిన నీకుం బోలిన తెఱఁగున నాడి, యెదిరిని లోఁగొనవచ్చునేని నట్లు నడపుము. నీ వన్నిటం జతురుండవు. నీకుం జెప్పవలయునే! పోయిరమ్ము.'

నావుడు దమనకుండు గ్రక్కున వెడలి, తొల్లి యామ్రోఁత వీతెంచిన జాడఁబోయి యాపొలంబు నలుగెలంకులు కలయంజూచి, యడుగుల చొప్పువట్టి డాయం బోయి, సంజీవకుంగాంచి 'యోయి వృషభేంద్రా! నేను మృగేంద్రుని భృత్యుండను. అతం డనుప నీపాలికి వచ్చితిని. అతండు దానుగ నీతోడ నాడుమాటలు నాకుంగఱపి పుత్తెంచినవాఁడు, వినుము. "ఈయరణ్యంబు మదధీనంబు. దీనంగలసత్త్వంబు లన్నియు నాశాసనంబు వహించి వర్తించుచున్నయవి. నీవును నా యాజ్ఞానువర్తివయి యుండునది. ఇంతియకాదు. మదీయానుచరులం గూడి వర్తింప నీకుం బ్రియంబేని ననురూపంబగు రాచకార్యం బొసంగెద. నీయిష్టం బెయ్యది యది యనుసరింపవచ్చు" నని యానతిచ్చె. ఇంతకుమునుపు నీవు నిశ్శంకంబుగ అఁకియవైచితివి గాఁబోలు. దాని విని యేలికకు నీపొలఁకువ విచారణీయంబయ్యె. నీవు భయం పడకుము. అమ్మహామహుండు కరుణాళుఁడు, ధార్మికుండుం గావున సజ్జనులకు గమ్యుండయి యున్నవాఁడు. నీవు శంకింపక యేతెమ్మని నుడివి యొడంబఱిచి, ముందు మృగేంద్రు పాలికిం జని, 'స్వామీ! దేవర యాజ్ఞచొప్పునం బోయి పరికించితి. మీవిన్న యారావంబు గావించినవాఁడు మీకనుగ్రాహ్యుండు గాని నిగ్రాహ్యుండు గాఁడు. తావకంబగునవక్రవిక్రమంబువిని భయాక్రాంతుఁ డయియున్నవాఁడు. ప్రభంజనుండు మహాభూజంబుల భజించుంగాని, వినతంబులగు తృణవితానంబులు పెకలింపం గడంగునెట్లు? శక్తిసంపన్నుండు దన్ను మాఱుకొనువానియందుఁ దనబలంబు వెలయించుఁగాని మ్రుక్కడుల లెక్కింపఁడు. ఇట్టిగుణంబు లేలినవారికి సహజంబులై యున్నయవి. అవసరంబగుడు వచియింప వలసెం గాని దేవరకు ముందఱ వాక్రువ్వవలయునె? అతఁడు సంజీవకుండను వృషభేంద్రుండు. బుద్ధిమంతుండు. ఏలినవారి యోలగంబున వర్తింపఁ జాలినవాఁడు. ఆతని స్వామిపాదంబుల చెంతకుం గొనివచ్చెద. ముదలయే?' యనం బింగళకుండు చిఱునగవుతోడ సంగీకార సూచకంబుగ మొగం బెగురవేయ, మహాప్రసాదం బనుచు వినమితగాత్రుండై యొదుంగుచు వేళంబ చని సంజీవకున కెదురువోయి.

శ్రీభాగ్యంబుకతంబున మృగరాజొంటి నున్నవాఁడు. కానిపించుకొన నిదియె సమయంబు. మసలక యేతెమ్మని వెంటం దోకొనివచ్చి, ఱేని కట్టెదురు దొలఁగించి, కొంత చెంత నిలుప, సంజీవకుండు భయ వినయసంభ్రమంబులు ముప్పిరిగొన వినమ్రుఁడయి వందనం బాచరింప, మృగేంద్రుండు సాదరంబుగం బ్రసాద మేదురంబగు క్రేగంటిచూపతనిపయిం బొలయ, 'నిన్ను మా దమనకుండు పెక్కు తెఱంగుల నుగ్గడింప విని సంతసించినారము. నీయట్టి ధీమంతుండు మాకొలువున కీయకొనుట మాకుం బరమలాభంబని యెన్నుచున్నవారము. మంత్రి పదంబు నీకొసంగినారము. జాగరూకుండవయి మన్నియోగంబులందు మాకు మాఱుగఁ గార్యంబులు నిర్వహించుచుఁ బరివారసంరక్షణాది కార్యంబులు కొఱంతపడకుండ జరుపునది.' అని యానతిచ్చి యది దొరంకొని తానును మంత్రియు బద్ధసఖ్యంబుననుండి నానాఁటం దక్కుంగల పరివారంబువలన నిరాదరుండై యుండె.

## ప్రశ్నములు

1. ధనము సంపాదింపవలె నని యెంచిన సార్థవాహుఁ డేమని చింతించెను ?
2. రాజానుగ్రహ సంపాదనము ముఖ్యమన్న దమనకునితోఁ గరటకుఁ డేమనెను ?
3. భక్షితావశిష్టమైన మాంసము తినుటకు రమ్మన్న కరటకునితో దమనకుఁడు చెప్పినదేమి ?
4. "ఎల్లవారును సత్త్వానురూపమైన ఫలమె వాంఛింతురు" దీనిని సోదాహరణముగ వివరింపుము.
5. కుశలమడిగిన రాజుతో దమనకుఁడు పలికిన దేమి ?
6. భయకారణ మడిగిన దమనకునితోఁ బింగళకుఁ డేమనెను ?
7. దమనకుఁడు సంజీవకునితోఁ జెప్పిన వాక్యము లేవి ?
8. సంజీవకునిఁ దోడ్కొనివచ్చిన దమనకుఁడు రాజుతో నేమని చెప్పెను ?
9. "వృషభము నరపశువుకంటె మేలు" ఎట్లు ?
10. "ఇట్టి గుణంబు లేలినవారికి సహజంబులై యున్నవి." ఆ గుణము లేవి ?

## విశేషములు

సమాసములను గుర్తించునది :—

యమునాతరంగిణి, ఆహారనిద్రాభయములు, నఖరవిదారితము, కర్తవ్యాంశము, తీక్ష్ణావలోకనము, నిశ్శంకము.

సంధులను గమనించునది :—

స్వోదరము, కృష్యాదికర్మములు, సాదరము, మన్నియోగము, దుస్త్యజము.

వ్యాకరణ విశేషముల నెఱుంగునది :—

కంచరపుపెద్ద, కొలువుకుకాండ్రు, పొరపసేల, కెలంకులు, కట్టెపరు, మాత్రాన, ప్రేఁగన్న, చెట్టిదపుఁ గూఁత.



# 8. సీతపాత్ర

శ్రీ కల్లూరి చంద్రమౌళి

(రామాయణ సుధాలహరి)

శ్రీ కల్లూరి చంద్రమౌళి ఎబట్టీనులో పట్టభద్రులై స్వదేశమునకు వచ్చి స్వాతంత్ర్యసమరమునఁ బాల్గొన్న యాంధ్రవీరులు. సంయుక్త మదరాసురాష్ట్రమునను ఆంధ్రరాష్ట్రమందును వీరు మంత్రిపదవులు నిర్వహించిరి.

రాజకీయములలోఁ బాల్గొనుచున్నను, వారి కభిమాన పాత్రమైనది భారతీయుల యాధ్యాత్మిక జీవితము. శ్రీమద్రామాయణమునందుఁ గల భక్తిభావముచే వారు 'రామాయణ సుధాలహరి' యను సద్గ్రంథము రచించినారు. అందులో ఉత్తర కాండమునుండి సీత పాత్రను జిత్రించు నీపాఠ్యభాగ ముద్ధరింపఁ బడినది.

విశాలప్రేమకు సీత మూర్తి. ఋషులకొఱకు రాక్షసులను నిర్వైరముతో సంహరింపవలదని సీత రామునర్థించెను. సీత సహస్రాది రాక్షసమరణములకుఁ గారణభూతురాలైనను, ఆనృశంస్యమున కాలవాలమై విలసిల్లెను. ఆమె భౌతికభోగములకు బుటముపెట్టి, పవిత్రీకరించి యాధ్యాత్మిక వికాసమును బోధించిన దేవి. ఆమెకు రామునియందుఁగల నిరంతర పవిత్రప్రేమ యామె మానసిక సమతను సమయింపఁజేసి, నిర్మలహృదయుఁడగు లక్ష్మణునంత వానినిదూషింపఁ జేసెను "సర్వం హ్యతిమాత్రం దోషాయ." 'అతి' దోషముల కాలవాలము, రామునియెడఁగల యతిప్రేమ యామె నావేశపూరిత పరవశను గావించి లక్ష్మణదూషణకుఁ గడంగఁజేసెను.

సీతనుగూర్చిన రాముని కర్ణకఠోరములగు పలుకు లామెయెడఁ గల యతిప్రేమసూచక మాత్రములే. దశరథునకు రామునియెడఁగల యతిప్రేమ వాని మరణమునకు దారిదీసెను. వాల్మీకి కవితావైశిష్ట్య మిట్టిదియే. లంకయం దున్నంతకాలమును సీత ధైర్యసాహసములఁ బ్రకటించెను. రావణుని పరదారాపహరణ కృత్యమును గర్హించెను. వానియెడఁ దీవ్రకోపమును బ్రదర్శించెను. కాని వీనికి భిన్నగా వాని ననుగ్రహించి, సాదరముగ సాధువాక్యములతో సదుపదేశమును గావించెను. కనికరమును జూపెను.

సీత యౌదార్యమునకు నిలయము. ఆదరమున కాలవాలము. దయకు నిధి. హనుమంతుఁడు సీతను దనవీపుపై నిడికొని రామునికడకుఁ గొంపోవుదుననెను. పవిత్రత కది లక్షణముగాదని సీత నిరాకరించెను. పతియే తన్నుఁ గొనిపోవలయునని నచ్చఁజెప్పెను. సీత శీలసంపద, పాతివ్రత్యప్రభావము లిందేగలవు. పతిదర్శనము నాకాంక్షించు—నిరీక్షించు మఱి యేసతియైనను నాస్థితిలో నాప్రతిపాదనము సంగీకరించియే యుండెడిది. కాని సీత లలితత్వము పరుని స్పర్శను సహింపనీయదు. అగ్నియంతటి వాఁడామె మాటచే హనుమంతుని యెడ శీతలుఁడాయెను. "శీతో భవ హనూమతః." సీత ప్రదర్శించు ననుగ్రహ మిట్టిది. రామాజ్ఞానుసారము సీత నిగ్రహమును నిర్వహించెను; కాని యనుగ్రహమును మాత్రము స్వతంత్రముగనే ప్రకటించెను. దుఃఖరాశికి మూర్తిమంతముగ విలసిల్లినసాధ్వి సీత. ప్రపంచమునఁగల సర్వదుఃఖములను దనయందు మూర్తీభవింపఁ జేసికొని పరుల కిఁక దుఃఖములు లేవనునట్లు మెలంగి విశ్వప్రేమకు నేకైక నిదర్శనముగాఁ బ్రవర్తిల్లిన ప్రేమస్వరూపిణి. పరులకష్టములను దనవిగ భావించి, వారికి సుఖమును జేకూర్పనారాటపడు నారీశిరోమణి. రాముని విశ్వాసమునకు, ఆత్మసంతృప్తికి సీత అగ్నిపరీక్షను గావించెను. రాముఁడు దాని నామోదించి సంతృప్తిని బడసెను. ఇది యెంతపేలవమో గాంచుడు. "శీతోభవ హనూమతః" అని యగ్నిని శాసింపఁజాలిన సీతను, ఆ యగ్నియే యెట్లు పరీక్షింపఁగలదు! ప్రచండ ప్రభాకర తేజస్సును అంధుఁడు గాంచఁ బ్రయత్నించు పగిదిఁ, చిన్నదీపముఁతో నాసూర్యుని గాంచ సంకల్పించు నల్పజ్ఞునిరీతిగ నున్నది. అగ్నిపలుకులనే గాంచుఁడు. "సీత వచించినదానినే నేను బలపఱచుచుంటిని గాని, స్వయముగ నే నేమియుఁ జెప్పుటలే" దనెను.

సీత రామునివెంట వనవాసమున కేగ నుంకించిన తరుణమున, "పాపం మయి న విద్యతే" నాయందేపాపమును లేదని రామునకు వీరవనితరీతిఁ బ్రకటించెను. దానినే అగ్నిప్రతిధ్వనించెను. "పాపమస్యాం నవిద్యతే" ఆమెయం దేపాపమును లేదు. అట్లయ్యును శారీరకభావమును విస్మరించి, భక్తిసాహసములతో నగ్ని నుఱికి — యాచంద్రతారార్క—

స్థిరమగు పాతివ్రత్య మహిమను అభివర్ధింపఁ జేసికొనెను. ఆమె యీ యౌచిత్య మున్నతశిఖరము నధిష్ఠించెను. తాను జన్మించిన దీలక్ష్య సిద్ధికే యని ప్రత్యక్షీకరించుకొనెను. స్వదేహమునకు మిన్నగ యశస్సును-కీర్తిని-భావించి యాదరించిన క్షత్రియవంశ సంజాతుఁడగు రాముఁడు, లంకయందు సీతనుగూర్చి కఠినోక్తులఁ బలికెను. అగ్ని పరీక్షకు గుఱి గావించెను. తిరిగి అయోధ్యకే తెంచిన తదుపరి నిరాధార నిందానుసార మరణ్యాములపాలు గావించెను. కాని తాను ప్రాణ త్యాగమును గాని, రాజ్యత్యాగమునుగాని గావింపఁ దలంప లేదు.

సీతను గాంచుడు ! ఒకపర్యాయము మాత్రమే పరీక్షకు సమ్మతించెను. రెండవపర్యాయము వీరవనితభాతి తనమానరక్షణార్థము తనప్రాణములను త్యజించెనేగాని, నీచముగ దిరిగి పరీక్ష నొసఁగ నిచ్చగింపలేదు. భూదేవిని శరణు-చొచ్చి యామెయందు లీనమై యమరత్వమును సాధించుకొనెను. ఆమె తన హృదయమునందలి దుఃఖమును అమృతముగ మార్చి, నిరంతర ప్రవాహముగఁ బ్రవహింపఁజేయును. ఆ మధురామృతమును పానమొనర్చినదే తడవుగఁ జైతన్యముచేఁ గళకళలాడు నాధ్యాత్మిక సందేశము నందించును. దుఃఖజీవిత మను ఫలమును పిండి తియ్యనిరసము నొసఁగును. భగవంతుఁడు మానవునకుఁ బ్రసాదించిన వరము దుఃఖము.

సర్వదుఃఖములను దనయందు జీర్ణింపఁ జేసికొనిన సాధ్వీమతల్లి యగు సీతను, నిరంతర ప్రవాహముగఁ గరుణరస ముప్పొంగఁజేయు నా స్త్రీమూర్తిని విశ్వమున కాదర్శముగఁ బ్రదర్శించుటకై మహర్షి వాల్మీకి రసమయమగు రామాయణమును రచించెను. "సీతాయాశ్చరితం మహత్" 'సీతచరితము మహత్తర' మని కీర్తించెను.

ఈ గొప్పతనము పతినిగూడి భోగముల ననుభవించుటయందు లేదు. తన పాతివ్రత్యమును రక్షించుట కాత్మార్పణమును గావించుట యందే గలదు. సీత తన సాహసమునకు సహనమును, సాధుత్వమునకు సరళత్వమును జోడించి, వానిని సమన్వయించెను. సమీకరణమునకుఁ దెచ్చెను. స్వచ్ఛందసువర్ణమయ పాతివ్రత్యమును బవిత్రీకరించి శీలము, వృత్తము, నడవడియను సుగంధపరీమళము నద్దానికి సమకూర్చెను.

సీత పతివ్రతమాత్రమే గాదు. పాతివ్రత్యమునకు మూర్తి; సాధ్వియే గాదు. సాధుత్వమునకుఁ బ్రతిమ. సాధుత్వ పాతివ్రత్యములకు నామరూపములను దీర్చి దిద్దిన సౌందర్యరాశియై యాధ్యాత్మిక తేజఃకిరణములను దశదిశలఁ బ్రసరింపఁ జేసెను.

సీత యాదర్శసతి. పతివ్రతయే గాని కేవలపతిప్రియ గాదు. పరిపూర్ణనారి. భారతసాహిత్యమునందే కాదు; విశ్వసాహిత్య చరిత్రమునం దమూల్యరత్నమై శోభిల్లు నారీరత్నము సీతమాత్రమే. త్రికరణశుద్ధిగఁ దనయిష్టదైవముగ రాము నారాధించెను. వాని యతిశయము నాకాంక్షించెను. సహనశీలముల శుభసమ్మేళనమైన పతివ్రతారత్నము; ఆదర్శమున కాదర్శమైన యిట్టివనితను విశ్వచరిత్రమున మఱెచ్చటను గాంచము.

"గత సారస్వతము నంతయు గాలింపుఁడు. నేను బ్రవచించుచున్నాను. ప్రపంచమున భావిని రానున్న సారస్వతము నంతయు నాలోకింపుఁడు. మఱియొక సీతను మీరు గాంచఁజాలరు. సీతయొక ప్రత్యేకమూర్తి. ఆమూర్తి యొకపర్యాయము మాత్రమే చిత్రింపఁబడినది. రాములు పెక్కు లుండుట సంభవము గావచ్చును. కాని యెల్లకాలమునకును సీత యొక్కతెయే. భారతనారీత్వమున కీమె యాదర్శమూర్తి. భారతనారి కుండవలసిన సల్లక్షణము లన్నియు సీతనుండియే యుద్భవిల్లినవి. యుగయుగములుగ నార్యావర్తమునం దంతటను స్త్రీపురుషులనుండి—బాలబాలికలనుండి—సర్వభారతీయుల నుండి, ఇది యది యననేల, యాబాలగోపాలమునుండి యారాధనముల నందుకొనినదేవి సీతయే. సహనముతో బాధలను భరించి, పవిత్రతకుఁ బావిత్ర్యము నొడఁగూర్చుచు, మహాసాధ్వియగు నీసీత ప్రకాశించుచున్నది.

"జంకు గొంకులకుఁ దావొసంగక, సణుగు గొణుగులకు స్థావర మీయక బాధలను భరించినదేవి సీతయే. సీత పవిత్రనారి. మానవులకును—దేవతలకును నాదర్శమూర్తియై ఆరాధనముల నందుకొనినది. సీత మహాసతి. మనజాతిదేవత యగు నీమె సదా మనహృత్పద్మము లందు నివసించుచునే యుండవలెను.

"మన పురాణములన్నియు నంతరింపవచ్చును. వేదము లంత ర్ధానము గావచ్చును. సంస్కృతభాషయు నశింపవచ్చును. కాని యిట నైదుగురు భారతీయులే మిగిలి నివసించుచున్నను — పామర భాషనే వారు మాట్లాడుచున్నను, వారి కంఠమునుండి సీత గాథ సదా వెలువడితీరును. మనజాతి జీవితమున సీత గాథముగ హత్తుకొని యున్నది. భారతజాతికిఁ జెందిన ప్రతి స్త్రీ పురుష రక్తనాళముల యందును వినిర్మల గంగాప్రవాహమువలె సీతాగాథ ప్రవహించుచునే యుండును. మన మందఱమును సీతామాత బిడ్డలమే."

—వివేకానందస్వామి

పాతివ్రత్య పాటవమును బలుక బ్రహ్మయంతటి వానికిని దరము గాదు. ఇఁక సామాన్యులమగు మనకు సాధ్యమా? సావిత్రి తన పాతివ్రత్య ప్రభావముచే యమునంతటి వానిని గజగజలాడించి నిస్సహా యునిఁ గావించెను.

పతివ్రత పతికిఁదప్ప నన్యులకుఁ దలనొగ్గ వాంఛింపదు. సీతా సతి పతియగు రామునిఁదప్ప నన్యుని మనస్సునందైనను దలంపలేదు. కన్నెత్తియైనను గాంచలేదు.

తన పాతివ్రత్యమహిమచే రావణుని నిర్వీర్యునిఁ గావించెను. అగ్నిని శీతలునిఁ గావించెను. తను మనః ప్రాణములఁ బతి కర్పణ మొనర్చి ఆచంద్రతారార్క మాదర్శసతియై వెలుగొందుచున్నది. రామరమణి లోకములకు ఈశ్వరిగ విరాజిల్లుచున్నది.

సీత జగత్తునకు జనని. మానవులకు మాత. దేవతలకు దేవి. భక్తులకు భగవతి. 'మాతృదేవో భవ' యను నారాధనము నందఱిచే నందుకొనుచున్నది.

దేవిలేని దేవుఁడు లేఁడు. సరస్వతిలేని బ్రహ్మ, పార్వతిలేని పరమేశ్వరుఁడు, సీతలేని రాముఁడు— దురూహ్యము, అచింత్యము. కాబట్టియే, సీత పతితపావనిగనే గాక, పతిపావనిగను బ్రసిద్ధి గాంచెను. రాముని శ్రీరాముఁడని కీర్తించుట యందలి యంతరార్థ మిదియే గదా!

## ప్రశ్నములు

1. సీత విషయమున వివేకానందుఁడు తెలిపిన భావముల వివరించునది.
2. "చిన్నదీపముతో నా సూర్యునిఁ గాంచ సంకల్పించు నల్పజ్ఞుని రీతిగ నున్నది" భావసందర్భము లేవి ?
3. "మహర్షి వాల్మీకి రసమయమగు రామాయణమును రచించెను" ఎందులకు ?
4. " 'అతి' దోషముల కాలవాలము" సోదాహరణముగ వివరింపుము.

## విశేషములు

సమాసములను గుర్తించునది :—

పతివ్రత, తను మనః ప్రాణములు, సాధ్వీమతల్లి.

సంధులను గమనించుము :—

సాదరము, రామాయణము, మహర్షి, కతినోక్తులు.

## రచన

సీత నడవడిలోని గొప్పతనమును నిరూపించుచు నొక వ్యాసము వ్రాయునది.



# 9. రెడ్డిరాజులకాలపు మత సంస్కృతులు

శ్రీ బూర్గుల రామకృష్ణారావు

(సారస్వత వ్యాస ముక్తావళి)

శ్రీ బూర్గుల రామకృష్ణారావు ప్రస్తుతము కేరళ రాష్ట్రమునకు గవర్నరుపదవి నిర్వహించుచున్నారు. వెనుకటి హైదరాబాదు రాష్ట్రమునకు వీరు ముఖ్యమంత్రిగా నుండిరి. హైదరాబాదు సంస్థానములో నాంధ్రసభలు జరుపుటగూడ నేరముగా నప్పటి ప్రభుత్వముచేఁ బరిగణింపబడిన నాఁటినుండి నేఁటివఱకు శ్రీ రామకృష్ణారావు నిరంతరాయముగా నాంధ్రభాషాసేవ చేయుచున్నారు. ఎనిమిది భాషలలో వారికిఁ బాండిత్య మున్నది. ఆంధ్రమందే గాక ఉరుదూ పారశీక భాషలందుగూడ వారి కపార పాండిత్యము కలదు. వారు స్వయముగా నాంధ్రములోనను ఉరుదూ భాషయందును గవిత్వము చెప్పినారు. హైదరాబాదులో వృద్ధినందుచున్న యన్ని సాంస్కృతిక సంస్థలకును వారి ప్రాపు కలదు.

హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తువారు శ్రీ రామకృష్ణారావు వ్యాసములు కొన్ని 'సారస్వత వ్యాసముక్తావళి' యను పేరఁ బ్రచురించినారు. అందుండి యీ పాఠ్యము సంగ్రహింపఁ బడినది.

ఆంధ్రులచరిత్రమున స్వతంత్రముగా రెడ్డియుగమని పరిగణింపఁబడు కాలముకొద్దిదే. అయినను, ఈ కొలఁది కాలమున రెడ్డిరాజు లాంధ్రదేశము నత్యున్నతదశకుఁ దీసికొనివచ్చినందునను, నీ యుగానంతరము కొలఁది కాలముననే ఆంధ్రుల స్వతంత్రరాజ్యము లంతరించినందునను నీయుగమును స్వర్ణయుగమని పేర్కొనుట యతిశయోక్తి కానేరదు. చాళుక్యులపిదప నీ రెడ్డివీరు లాంధ్రదేశమున స్వతంత్ర పతాకమును స్థాపించి తెనుఁగుదేశమును, తెనుఁగు బాసను వెలయఁజేసి కృష్ణా గోదావరీ మండలములను, కర్నూలు కడప మండలములలోని పెక్కు భాగములను, హైదరాబాదు రాష్ట్రములోని మహబూబునగరు, రాయచూరు, మెదకు, నల్లగొండ, వరంగల్లు మున్నగు మండలములను దాదాపు ముప్పదివేల చదరపుమైళ్ళ విస్తీర్ణముగల దేశమును స్వతంత్రులుగా నూటయేఁబది సంవత్సరములు పరిపాలించిరి. పిదప నొకవంక వెలమవీరులయొక్కయు, మఱియొకవంక ముస్లింసేనలయొక్కయు నాక్రమణమునకు బలియై తమశోభను గోల్పోయిరి. వారు నిర్మించిన కొండవీడు, కొండపల్లి, కోరుకొండ,

మెదకు, రాయచూరు మొదలగుదుర్గ రాజములు, వారొందినకృతులు, రచించిన యుద్ధగ్రంథములు, స్థాపించిన శాసనములు, కట్టించిన ప్రఖ్యాత దేవాలయములు, దాన మొసంగిన బ్రాహ్మణాగ్రహారములును నేఁటికిని చరిత్రమున శాశ్వతముగ నున్నవి. వైదికమత పునరుద్ధరణమునం దాంధ్ర దేశమున రెడ్లు గావించినసేవ యపారమైనది.

ఈరెడ్డియుగపు నూటయేఁబది సంవత్సరముల మతచరిత్రలను అర్థముచేసికొనుటకై కొంత పూర్వచరిత్ర స్మరణ మవసరము. భారత దేశమునఁ బ్రాచీన కాలమునుండి ఆర్యులమతమున రెండు స్వతంత్ర శాఖలు గనుపడుచున్నవి. వైదికశాఖలు, తాంత్రికశాఖలు. అవైదికములగు బౌద్ధజైనమతములు ప్రబలిన తరువాతఁ బలుకుఁబడి తగ్గి యీ మతవిప్లవముధాటి కాఁగలేక సనాతనమతము లతివిషమస్థితిలో నున్నసమయమున బౌద్ధమతమునందు రెండుచీలిక లుద్భవించి, రాను రాను క్షీణదశ నొందుచు వచ్చెను. ఆకాలమున దక్షిణాపథమును జాళుక్యులు, చోళులు, పాండ్యులు పరిపాలించుచుండిరి. త్రిమతాచార్యులగు శ్రీ శంకరరామానుజమాధవు లుదయించి జీర్ణించుచున్న జైనబౌద్ధమతముల నిర్మూలన మొనర్చిరి. వీరు పూర్వమునుండి వచ్చుచున్న తాంత్రికవైదిక శాఖల రెంటిని సమన్వయించి వైదికకర్మానుష్ఠానముతోఁబాటు తాంత్రికుల వైరాగ్యవిధిని, ఉపాసనాపద్ధతిని కలిపి ప్రజామోదమును బడయఁజాలునటుల మతము నుద్ధరించిరి. తాంత్రిక విధులు బౌద్ధులలో నంతకు పూర్వమే సుపరిచితములు గావింపఁబడి నందున, ఈపునరుద్ధరింపఁబడిన బ్రాహ్మణమతము తొందరగా ప్రసరింపఁ దొడంగెను. కాకతీయ యుగారంభమునాఁటికి జైనశైవవైష్ణవ మతము లహమహమికతో, స్పర్థావైషమ్యములతోఁ బ్రచారముఁ బొందుచుండెను.

కాకతిరాజుల కాలముననే బసవేశ్వరుఁడు, పండితారాధ్యులు, విశ్వేశ్వర శివదేశికులు మున్నగువారి ప్రతిభావిశేషమువలన శైవ మతము ప్రబలుచుండెను. వారి సామంతులు మండలేశ్వరులగు రెడ్డి ప్రభువులుగూడ శివభక్తులే. గణపతిదేవుని కాలమున జైనులయెడ విద్వేషముపెరిగి, జైనులు, బౌద్ధులు హింసింపఁబడిరి. ఈ చక్రవర్తి

యద్వైతవాది యని శాసనముల వలనఁ దెలియుచున్నది. ఈకాలమున శైవవైష్ణవ మతములు జంటగా విజృంభించుచు, నొకేవంశమున నొక సోదరుఁడు శైవుఁడును, మఱియొకఁడు వైష్ణవుఁడుఁగా నుండుచు వచ్చిరని తెలియుచున్నది. పూర్వచరిత్రను భూమికగా నుంచుకొనినచో రెడ్డియుగముయొక్క పరిస్థితులను సులభముగాఁ దెలిసికొనఁ గలము.

రెండవ ప్రతాపరుద్రుఁ డలపుఖానునిచే బందీకృతుఁ డగుటతో క్రీ. శ. 1323వ సంవత్సరమున నోరుగల్లు పతనము చెందినది. అప్పటి నుండియు రెడ్డియుగము ప్రారంభమైనదని చెప్పవచ్చును. కాకతి సామ్రాజ్య మంతరించిన తరువాతఁ గాకతీయుల సామంతులగు పద్మ నాయకులును, రెడ్లును గొందఱు తమతమ మండలములను స్వతంత్ర ముగాఁ బరిపాలించుచుఁ జిన్నచిన్న రాజ్యముల నేర్పఱచుకొనిరి. వానిలో రెడ్డిరాజ్యములు నాలుగు. (1) కోరుకొండరెడ్లు (2) కొండ వీటిరెడ్లు (3) కందుకూరిరెడ్లు (4) అల్లాడిరెడ్లు.

కోరుకొండదుర్గము రాజమహేంద్రమునకుఁ బదునొకండు మైళ్ల దూరమున నున్నది. ఈ కోరుకొండరెడ్లకాలము స్వల్పమైనది. వీరు విద్యాసక్తులు, ధర్మరక్తులు, వైష్ణవమతాభినివేశము కలవారు నై యుండిరి.

రెడ్డిరాజులలో నందఱికంటెు విఖ్యాతులు కొండవీటివారే. ఈవంశమువారు నెల్లూరినుండి సింహాచలమువఱకుఁ గల తెనుఁగు దేశమును బరిపాలించి, తుదిని స్వతంత్రాంధ్ర రాజ్యమును నిర్వ హించి స్వర్ణయుగమునకుఁ గారకులైరి. కావుననే యీవంశముయొక్క రాజ్యవైభవము, కళాపోషణము, విద్యావైదుష్యము, పరాక్రమము నాంధ్రదేశచరిత్రమందు సుప్రసిద్ధమై యొప్పుచున్నవి. పంట శాఖీయుఁ డగు దేసటివంశపు వేమారెడ్డి యీవంశమునకుఁ గర్త.

ఈ వేమారెడ్డి దేసటి ప్రోలయరెడ్డి ద్వితీయ కుమారుఁడు. ఈ దేసటి వంశమువారును, రాజమహేంద్రవరపు టల్లాడ వంశము వారలును జ్ఞాతులు. కాకతీయ సామ్రాజ్య విధ్వంసము తరువాత నార్యధర్మములువిచ్ఛిన్నములగుచుండ, నార్యధర్మాభిసక్తుఁడై కృష్ణా

నదీ తీరప్రాంతదేశములందలి తురుష్కుల నోడించి, పూగినాటిదేశమున నీయన రాజ్యమును స్థాపించియుండెను. ఎఱ్ఱాప్రెగడ యితని 'నవదాతచరితంబున నఖిలజన రంజనం బొనర్చుటం జేసి రాజశబ్దంబునకు భాజనం' బయ్యె ననియు, 'నన్వయైక పావనుఁ' డనియు వర్ణించి యున్నాఁడు. 'చుట్టపుమేరు' వనిస్తుతియించి యున్నాఁడు. వేమారెడ్డి బిరుదనామము లనేకములు. అందులో నర్థి ప్రత్యర్థి, హేమాద్రిదాన నిరతుఁడు, నపరిమిత భూదాన పరశురాముడు, ననేక నగరోపకంఠ ప్రతిపాదితబహువిధారాముఁడు, శ్రీపర్వతాహోబిలనిర్మితసోపానుండు, బసవ శంకరుఁడు మొదలగునవి. ఇతఁడు నితని మంత్రియగు రామాప్రెగడయు ధర్మపరాయణులై తమ పరిపాలనమునార్యోక్త ధర్మానుసారముగా నిర్వహించిరని తెలియుచున్నది. ఇతని సహోదరు లన్నారెడ్డి, మల్లారెడ్డి, పుత్రుఁ డనపోతారెడ్డి, మేనమఱఁది నూకారెడ్డియు నితని సుప్రసిద్ధ సేనానులు. వీరందఱు శివభక్తులు. వీరిలో మల్లారెడ్డి యెఱ్ఱాప్రెగడకు నాశ్రయమిచ్చి, యాతనిచే రామాయణము, హరివంశము రచింపఁ జేసినాఁడు. అన్నారెడ్డి సకలార్థ సమన్వితుఁడు, అన్నదాన సంపన్నుఁడు, భవాంఘ్రిసరోజ పూజాసన్నుతి తత్పరుఁడు. వేమారెడ్డి కొడు కనపోతారెడ్డి 'కీర్తనీయ సుగుణస్తోమంబు లందేమి యున్, రామ స్ఫూర్తికి లోచ్చుగాక సరియై రాజిల్లి'న వాఁడు. ఎఱ్ఱాప్రెగడవంటి మహాకవి, పవిత్రశీలుఁడు వర్ణించుటవలన నిజముగా వీరందఱు ధర్మాభిరతు లనియే విశ్వసింపవలసి యున్నది.

'నన్నయభట్ట తిక్కకవినాథులు చూపినత్రోవ పావనంబెన్నఁ బరాశరాత్మజమునీంద్రుని వాఙ్మయ' మను విశ్వాసముతో 'భారత పరాంశ' మగు హరివంశమును దెలుఁగుచేసి, భారతారణ్యమును బూరించి, రామాయణ నృసింహ పురాణములను రచించిన శంభుదాసుని కాలము వఱకును శైవవైష్ణవ మతముల పరస్పర విద్వేషములు తగ్గి శివకేశవ భేదరహితమగు 'భాగవత ధర్మమును' బండితులైనవారు పెద్దలు స్వీకరించుచుండినట్లు విదితమగుచున్నది. పోతనామాత్యుని యాదర్శ మిదియే. నృసింహపురాణము నరాంకితముగాఁ జేయక యహోబలనృసింహున కంకిత మొనర్చెను. ఆనువంశికముగా

శైవుఁడగు పోతన్న రామభక్తుఁ డగుటయు, నతని బావమఱఁది రుద్రాక్షమాలలు ధరించి శివభక్తుఁడుగా నుండుటయు నీవిషయమునే స్పష్ట మొనరించుచున్నవి. ఒక కుటుంబములోనివారు భిన్నభిన్న సంప్రదాయము లవలంబించి యేవిధమైన వైరుధ్యములేక యుండిన ట్లానాఁటి సారస్వతమున నుదాహరణములుకనుపించుచున్నవి. ఈరాజు నకుఁ 'బ్రాపైన' యవచి దేవయసెట్టి శివభక్తుఁడు. అతని శివభక్తిని దాతృత్వమును శ్రీనాథుఁడు హరవిలాసమున వర్ణించినాఁడు.

వేమారెడ్డి యాస్థానము వేదవేదాంగ కోవిదులతోడను, షట్ఛాస్త్ర విదులైన పండితులతోడను నభిరామమై యుండెను. గీర్వాణాంధ్రభాషా కోవిదులైన కవిసత్తము లాయాస్థానము నలంకరించి యుండిరి. వారి సామంతులును, దండనాథులును, రాజ బంధువులును వారి ననుకరించి రని విశ్వసింపవచ్చును. అందులకుఁ దగిన యాధారములు కూడఁ గలవు.

ఈవేమ భూపాలుని యనంతర మాతని పెద్దకొడుకన పోతరెడ్డి రాజ్యమును బాలించెను. ఇతఁడు మహా పరాక్రమశాలి. అనేక యుద్ధములుచేసి, యేయుద్ధమునం దైనను నోడినట్లు కానరాదు. ఇతఁడు నార్యధర్మప్రచారము గావించుచు, వేదాధ్యయన సంపన్నులైన బ్రాహ్మణోత్తములకుఁ దండ్రి యొసంగిన దానములను గాపాడుచుఁ దానును దానధర్మములు చేయుచుండెను. ఈ యనపోత రెడ్డిగారి కాయురారోగ్యైశ్వర్యాభివృద్ధి కొఱకై యమరేశ్వర దేవాలయమును బునః ప్రతిష్ఠించి మల్లయమంత్రి కీర్తిమంతుఁ డాయెను. ఆకాలములో రాజుగారి పేరను, బితృపితామహాదులకుఁ బుణ్యముగాను దేవాలయ ప్రతిష్ఠలు, దానములు గావించుట కలదు. ఈయనపోత రెడ్డి కాలమున మోటుపల్లి రేవు పునః ప్రతిష్ఠితమై నౌకావ్యాపారమున కాలవాలమై యాంధ్రుల వాణిజ్యకీర్తి దేశమున వెలయించెను.

ఈ యనపోతభూపాలుని తరువాత నాతని తమ్ముఁడగు అన వేమారెడ్డి రాజ్యమును బాలించెను. అనవేముఁడు హేమాద్రిదానదీక్షితుఁడై, దారిద్ర్య విద్రావణుఁడై. శిబికర్ణదధీచులం బోలి ప్రసిద్ధి గాంచెను.

ఇతని తరువాతఁ గుమారగిరిరాజు కాటయవేమారెడ్డి సహాయమునఁ బరిపాలించెను. ఈరాజు భోగలాలసుఁ డనియు, వసంతోత్సవప్రియుఁ డనియు, వసంత రాజను బిరుదము గలవాఁ డనియుఁ దెలియుచున్నది. అవచితిప్పయసెట్టి యీ రాజునకై దేశదేశముల నుండి సుగంధద్రవ్యములు, మాణిక్య గాణిక్యాదులును దెప్పించుచుండెడివాఁడు. శ్రీనాథుని హరవిలాసమున కీతఁడే కృతిపతి. ఆ గ్రంథములో నితఁడు శ్రీనాథునకుఁ జెప్పిన మాటలవలన నాకాలపు వైశ్యుల యైశ్వర్యసంపదయేగాక, వారి ధర్మానురక్తియు, దైవ బ్రాహ్మణభక్తియు దెల్లమగు చున్నవి. వణిగ్వంశ చరిత్రవలన నాకాలమున సముద్రయానము, విదేశ వ్యాపారము బహిష్కార భయము లేక జరుగుచుండెడివని తెలియుచున్నది.

కుమారగిరి తరువాతఁ గొండవీటిని బెదకోమటి వేమభూపాలుఁడు పాలించెను. కోమటివేమారెడ్డి తరువాత రాచవేమన 1420-1424 వఱకు మాత్రమే పాలించెను. తరువాతఁ గొండవీటి రాజ్య మీవంశమునకు నిలువలేదు.

కందుకూరిరెడ్లను గుఱించి విశేషముగా వ్రాయవలసినదిలేదు. వీరు కొండవీటి వేమభూపాలుని తమ్ముఁడగు మల్లారెడ్డి వంశస్థులు. వీరు కందుకూరు దుర్గమునుండి పూగినాటిసీమను బాలించుచుండిరి. 1424 తరువాత నీవంశమువారు విద్యానగర చక్రవర్తియగు ప్రౌఢ దేవరాయనికి సామంతులైరి. ఈ వంశములోని శివలింగభూపతి యనురాజు మిక్కిలి విద్వాంసుఁడై సంస్కృతమున గ్రంథములు రచించినాఁడు.

క్రీ. శ. 1386 నుండి 1415 వఱకుఁ గాటయవేమభూపాలుఁడు రాజమహేంద్రవర రాజ్యభాగమును బరిపాలించెను. ఈయన సింహాచలమువఱకుఁ దనరాజ్యమును వ్యాపింపఁజేసిన పరాక్రమశాలి, పండితుఁడు, కవి. కుమారగిరి యనంతరము రాజమహేంద్రవరమును స్వతంత్రముగాఁ బాలించుచున్నందునఁ బెదకోమటి వేమభూపాలునకు స్పర్థలుపెరిగి వైరముగాఁ బరిణమించెను. ఈవిధముగా జ్ఞాతివైరము పెరిగి రాజ్యపతనమునకుఁ గారణమయ్యెను. కాటయవేమ భూపాలుని

సంస్కృతభాషాభిమానము, వేదశాస్త్రాది విద్యాపోషణ, హిందూ మతాభిమానము శాసనముల వలనఁ దెలియుచున్నవి. ఈయన యనేక దానధర్మములు గావించియున్నాఁడు. ఇతనితరువాతఁ బాలించిన యల్లాడరెడ్డి శ్రీనాథుని భీమేశ్వరపురాణము, కాశీఖండములలో వర్ణింపఁబడి యున్నాఁడు. వీరు శైవమతావలంబకు లైనను బరమత సహనము గలిగినవారని తెలియుచున్నది. బ్రాహ్మణులకీకాలమున మిక్కిలి సుఖజీవనము గలిగినట్లు శ్రీనాథునివర్ణనల వలనఁ దెలియు చున్నది. "ధరియింప నేర్చిరి దర్భ వెట్టెడు వ్రేళ్ల, లీల మాణిక్యాంగుళీయకములు" మున్నగునవి నిదర్శనములు. శ్రీనాథుఁడు రచించిన వని చెప్పఁబడు వీథినాటకము, చాటు పద్యములవలన నానాఁటి సాంఘిక పరిస్థితులు తెలియుచున్నవి.

ఎట్లయినను, గ్రామీణులును, జానపదులు నగు వారి మత పరిస్థితులను దెలిసికొనుట కాధారములు లేవు. మతసంబంధము లగు నీ యాదర్శము లితరజను లందఱికి మార్గదర్శకములై యుండునని యూహింపవచ్చును.

## ప్రశ్నములు

1. కాకతీయులకుఁ బూర్వముగల మత పరిస్థితులను వివరింపుము.
2. కాకతివంశపురాజు లే మతమునకుఁ జెందినవారు ?
3. రెడ్డిరాజ్యము లవతరించుటకుఁ గలిగిన యవకాశమేమి ?
4. కొఱుకొండ రాజ్య మెచ్చట నున్నది ? దాని పరిపాలకు లెట్టివారు ?
5. కొండవీటి రాజులలో ముఖ్యు లెవరు ?
6. దేసటి వేమారెడ్డిని గూర్చి నీకుఁ దెలిసిన దేమి ?
7. కుమారగిరిరెడ్డి రాజ్యపాలన మెట్టిది ? ఆనాఁటి వైశ్యుల స్థితి యెట్లుండెను ?
8. కందుకూరి రాజ్యమును గూర్చిన విశేషము లేవి ?
9. రాజమహేంద్రవర పరిపాలకులను గూర్చి వివరించి వ్రాయుము.

★

# 10. మహాకావ్య నిర్మాత మొల్ల

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ

(ఆంధ్ర కవయిత్రులు)

శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాన్తమ్మ ఉభయ భాషాప్రవీణ పట్టము పొందిన కవయిత్రి. ఈమె మధురకవు లగు శ్రీ నాళంకృష్ణారావు పుత్రికయగుటచే వంశ పారంపర్యముగ కవిత్వము సంస్కృతి అలవడిన విశిష్టవ్యక్తి. ఆంధ్రదేశములోని అనేక సాంస్కృతిక సంస్థలలో ఈమెకు గౌరవస్థానము కలదు. ఈమె మంచివక్త్రి.

ఈమెకు విద్వత్కవయిత్రి, తెలుఁగు మొలక, మొదలగు బిరుదులు కలవు.

భారతదేశములో వనితలు నిర్వహించిన ప్రముఖపాత్రను ఉద్ఘాటించుట ఈమె కిష్టము. ఈమె రచియించిన ఆంధ్ర కవయిత్రులు అను ఉద్గ్రంథమును తెలుగుభాషా సమితివారు 1952లో ఉత్తమ గ్రంథముగ బహూకరించి గౌరవించిరి. ఈ పాఠ్యము ఆ గ్రంథమునుండి గ్రహింపఁ బడినది.

"సుడిగొని రాముపాదములు సోకినధూళి వహించి రాయి యే
ర్పడ నొక కాంతయయ్యెనఁట; పన్నగ నాతని పాదరేణు వి
య్యెడ వడి నోడ సోక యిది యేమగునో యని సంశయాత్ముఁడై
కడిగె గుహుండు రాము పదకంజయుగమ్ము భయమ్ము పెంపునన్."

అను పద్యరత్నముతో సారస్వతేయుల హృదయపీఠముపై భద్రాసనముఁగొన్న మొల్ల రామాయణ మహాకావ్య నిర్మాణము గావించిన చదురాలు.

తెలుఁగు తరుణిమై తరుణులలో ప్రథమముగా తెలుఁగు బాసను మహాకావ్య నిర్మాణము గావించిన ఘనత ఈకాంతకు నాఁటికి నేఁటికిని నశ్లే నిలిచియున్నది. మొల్ల కుమ్మరి కులజాత. కేసనసెట్టి యీామె తండ్రి. బాలవితంతు వగుట, గ్రంథమునందెచ్చటను భర్తవంశ కథనము కనఁబడదు. ఈమె ఆంధ్రభోజుఁడు శ్రీకృష్ణరాయల సమకాలీన యందురు. అనగా 1525 సంవత్సర ప్రాంతమునాటిది. కాని యేలనో యీామెనుగూర్చి యాకాలము వారెవరుఁ బ్రస్తావింపరైరి. దానికిఁ గారణము ఆమె స్త్రీయగుటయు, కుమ్మరికులజ యగుటయు నేమో!

రామనామ స్మరణముతో రామాయణకావ్య నిర్మాణముతోఁ జల్లఁగాఁ గాలముగడపి ధన్యురాలైన సాధ్వి మొల్లయని మనము తెలిసికొనినఁ జాలును. తెలుఁగున రామాయణ సంగ్రహరచన చేసిన వారిలో నీమె యొకర్తుక. తిక్కన నిర్వచనోత్తర రామాయణము అయ్యలరాజు రామభద్రుఁడు రామాభ్యుదయమును రచించిరి. కాని విమర్శకులు కవిత్వ శిల్పమున మొల్లకే యనూనగౌరవము నూల్కొలుపఁ జేసిరి.

ఆరుకాండములలో సుమారు 900 పద్యములు కలవు. మొదటి మూఁడు కాండములకంటెఁ దుదల మూఁడుకాండములు మరింత మురువు గూర్చినవి. సుందరకాండము మొదలు మొల్ల పరవశత్వముఁ జెంది రామాయణ రచనము గావించినదా యనిపించును. యుద్ధవర్ణనముల పట్ల నీమె నిజముగ యుద్ధములు చూచెనుగాఁబోలు ననిపించును. గ్రంథము "నగర్త్వినశశి........" వర్ణనాదులతో మహాకావ్య లక్షణ లక్షితమై యున్నది. దేశీయమగు తెలుఁగురచనపై నామెకు మిక్కిలి మక్కువ. కావ్యరచనకు వలయు లక్షణములు దానేమియు నెఱుఁగననియు, గోపవరపు శ్రీకంఠ మల్లేశుకృపను కవిత్వము చెప్పితి ననియు నామె వ్రాసికొన్నది.

"కందువ మాటల సామెత
లందముగాఁ గూర్చి చెప్ప నది తెలుఁగునకున్
బొందై రుచియై వీనుల
విందై మఱి కానుపించు విబుధుల మదికిన్."

అను పద్యమును, మఱియు, "పలిపపు సన్నపయ్యెద———
పొందగునే పటహాది శబ్దముల్" అను పద్యమును బట్టియు నామె రచనాపద్ధతి హృదయపద్ధతి తేటయయినదని మనము తెలియఁగలము.

ఈమె రచనయందు నటనట పోతనార్యుని ప్రభావము గానఁబడుచుండును.

"పలికెడిది భాగవతమట, పలికించెడువాఁడు రామభద్రుం డట".
అను పోతనార్యుని యాదర్శమునే తిరిగి మొల్లయాది పల్కినది.

"చెప్పుమని రామచంద్రుఁడు
చెప్పించిన పలుకు మీఁదఁ జెప్పెద నే నె
ల్లప్పుడు నిహపరసాధన
మిప్పుణ్యచరిత్ర, తప్పు లెంచకుఁడు కవుల్."

అంతే కాదు – కథాంశములలో, వర్ణనాంశముల పట్టునను సంత్యపద నియమములలోఁ బోతనార్యు ననుగమించిన పట్లు గలవు. కావ్యవస్తువగు రామగాథను గూర్చి పఠితలకు వేర దెలుపవలసిన దేమి?

కావ్య విమర్శనకుఁ బని విందము :– మొల్లకవిత్వము కేవల ముబుసు పోక కేవేవో యొందు రెండు పద్యము లల్లినది కాదు. ఆమె గొప్ప పండితురాలు. సందర్భము, ఔచిత్యము నెఱిఁగిన యతివ మిన్న. మిక్కిలి కష్టములగు నర్థాలంకారములను, శబ్దాలంకారములను వాడి నది. పండితులును, సరిగా నిర్వహింపలేని విరోధాభాసా ద్యలంకారములను గూడ నిర్వహించినది.

"ప్రకటానురాగసంపన్ను లౌదురు కాని
రమణీయరుక్మకారుక్మకులు గారు."
"మదనాగయూథసమగ్ర దేశము గాని
కుటిలవర్తన శేషకులము గాదు."
అను నవి దీని కుదాహరణములు.

"రాజులు కాంతియందు, రతిరాజులు రూపమునందు, వాహినీ
రాజులు దానమందు, మృగరాజులు విక్రమ కేళియందు, గో
రాజులు భోగమందు, దినరాజులు సంతత తేజమందు, రా
రాజులు మానమందు, నగరమ్మున రాజకుమారు లందఱున్."

ఇట్టి వామె పాండిత్యమున కుదాహరణములే గాక, భట్టు మూర్తి, అడిదము సూరకవి యంతటి వారికి సహితము లోభనీయము లై యనుకరణీయము లైన వన్న, నీ యమ పలుకుఁబడి పసదనమును కేమైనఁ బసదనము లీయవచ్చును.

స్వభావోక్తి చాతుర్యముతో వర్ణ్యాంశమును బఠిత కన్నుల యెదుట నిల్పు శక్తి మొల్లయం దతిమాత్రముగా నున్నది.

“సాలము పొంత నిల్చి రఘుసత్తముఁ డమ్మరివోసి శబ్దవి
న్మూలము గాఁగ విల్దివిచి, దృష్టియు, ముష్టియుఁ గూర్చిగోత్రభృ
త్కూలము వజ్రపాతహతిఁ గూలువిధంబునఁ గూలనేసె న
వ్వాలిఁ బ్రతాపశాలి మృడవందనశీలి సురాలి మెచ్చఁగన్.”

ఇందలి స్వభావోక్తియేకాక, అంత్యపాదమున నంత్యపద నియమమును గాంచుఁడు. అంతేకాక, యీపద్యమున ధనువు నాకర్ణాంతము లాగి విడుచునపుడు, ధన్వి నిలుచుండ వలసిన భంగిమము, ఆ ధనువునం దుంచవలసిన శ్రద్ధాదృష్టియు, నారిని దిగుచునప్పటి విన్యాసమును మూర్తిమంతములుగా రూపింపఁబడినవి. చూడుఁడీ క్రింది పద్యమును నట్టిదే.

“మొగము బిగించి పాదముల మొత్తముగా నఁట నూఁది త్రొక్కి, నీ
టుగ మొగ మెత్తి భీకరకఠోరరవంబున నార్చి బాహు ల
త్యగణితలీలఁ జాచి, వలయంబుగ వాలము ద్రిప్పి వ్రేఁగునన్
నగము సగంబు క్రుంకఁ గపినాథుఁడు నింగికి దాఁటె రివ్వునన్.”

అన్నింటిని మించి యందగించిన స్వభావోక్తి :—

“పతిఁబాసినట్టి యాపదకంటెఁ బలుమారు
వివిధమాయలచేత వేఁగి వేఁగి
వీరదానవకోటి వికృతవేషంబులు
కనుఁగొని చిత్తంబు క్రాఁగి క్రాఁగి
తనదిక్కు లేమికై తల్లడిల్లుచు నాత్మ
లోపల మిక్కిలి లోఁగి లోఁగి
కర్ణకఠోరముగా నాడు మాటల
దొరగెడి కన్నీటఁ దోఁగి దోఁగి
రాముఁ దలఁచుకొంచు, రామునిఁ బేర్కొంచు
రామరామ యనుచు, రమణి పలుక

కపివరుండు సూచి కామినీరత్నంబు
సీత యంచుఁ బొంగెఁ జిత్తమందు."

అయోధ్యా కాండాంతర్గత జ్యోత్స్నానుభవ మొకింత తలఁపునఁ బారనిండు. ఉచిత శృంగారరసానుప్రాణితమై విరిసియు విరియని తామర వలె లలితంపు వలపులఁజిలికియుఁ జిలుకని లేఁ గులాబికన్నె వలె నతిసుకుమారమై యొప్పుచుండ లేదా ? చిఱుతపద్దెములలో అలఁతి పొలఁతి పదములలో నెంతో రసభావములను ఒప్పించుశక్తియు దీర్ఘకథావృత్తముల నలవోకగా సులలితముగఁజొప్పించు శక్తియుఁ గలదు. చిన్ని పద్యమున పెచ్చుభావము లొప్పించుటకు,.

"జడలు ధరియించి తపసుల చందమునను
దమ్ముఁడును దాను ఘోర దుర్గమ్ములందుఁ
గూరగాయలు కూడుగాఁ గుడుచునట్టి
రాముఁ డేరీతి లంకకు రాఁగలండు."

సానలు దీర్చిన జాతిరతనములువోలెఁ బ్రకాశించు నిట్టి చిన్ని గీతము లెన్నైనఁగలవు.

ఇంక నొక ముఖ్యవిషయమును దడవి మొల్లకడ సెలవుగైకొందము. ఔచితీ విచారమున మొల్ల కడు దిట్టయని మున్నె పేర్కొంటిమి కదా ! "శింశుపాశ్రిత యగు సీతామతల్లిం గని ... దనుజకాంతలంతంత నెడఁబాసి నిదురవోయి రంత. ..యదరి సీత తనకు దిక్కు లేమి తలపోసి దుఃఖింప పవనసుతుఁడు మనుజభాషఁ బలికె.

"ఉన్నాఁడు లెస్స రాఘవుఁ
డున్నాఁ డిదె కపులఁ గూడి యురుగతి రానై
యున్నాఁడు నిన్నుఁ గొనిపో
నున్నాఁ డిది నిజము నమ్ము మూర్వీతనయా."

జానకి నిస్పృహయై తన రాముఁ డేనాఁటికైన వచ్చు నను ఆశయు నుజ్జగించి తన దిక్కు లేమిఁ దలపోసి దుఃఖించు సమయమున నామెలోఁ బోయిన ఆశను పొటమరింపఁజేయఁ బవనసుతుఁడు

"ఉన్నాఁడులెస్స రాఘవుఁ డున్నాఁడు" అని నొక్కి పలికినాఁడు. క్రియావాచకము మొదలుగాఁ బ్రారంభించిన ఈపద్యమున మొల్ల 'హృదయ మొల్లములో' ఈభావ మొల్ల దోబూచులాడి యుండ వచ్చును. చికిలి చేసిన చిన్ని తుటారిక త్రియవోలెఁ జెన్నుమీరిన ఈచిన్నిగీతము సీతా సంశయచ్ఛిన్నము చేసిన దనుటలో సందియ మేమి? ఇట్టిదె యింకొక పద్యము గలదు :

"కంటిన్ జానకిఁ బూర్ణచంద్రవదనన్ గల్యాణి నా లంకలో
గంటిన్ మీ పదపంకజంబులును నేఁ గౌతూహలం బొప్పఁగా
గంటిన్ మీ కరుణావలోకనము విఖ్యాతంబుగాఁ గీర్తులన్
గంటిన్ మా కపివీర బృందములలో గాంభీర్యవారాన్నిధీ."

వీనుల విందై అమృతపు సోనల పొందై యీ పదబంధము రాఘవునకే కాక మనకు నానందదాయి యైనది.

అయ్యలరాజు తన రామాయణమున శబరి వృత్తాంతము నుజ్జగించి, కబంధవృత్తమును గడుపెంచినాఁడు. మొల్ల యట్లు కాక శ్రీరామచంద్రుని దీనజనావనత్వమునకుఁ బట్టువ పారువయై నెగడిన శబరి గాథను పెంచి కబంధవధను తుంచినది.

"కూరాటి తేరులు, కావేటి గుఱ్ఱములు, పూటగా భారపడంగఁ జాలుదు, కంటిలో నెరసు చందమున, చెవి నిల్లు కట్టుకొని" మున్నగు జాతీయములు, నుడికారములు నెన్నో గలవు. పనయ్యేని, పట్టుక, కోసుక, యిత్యాది ప్రయోగములు నటనటఁ గలవు. అయ్యవి రసపుష్టిని జెఱచునంతటి శక్తిమంతములు కానేరకపోయినవి.

భాస్కరరామాయణము ననుకరించిన ఘట్టము లెన్నియున్నవో వానికి మెఱుఁగులు దిద్దిన సందర్భము లన్ని యున్నవి.

అదభ్రశుభ్రరుచితో నాచంద్రార్కము తులలేని మానికమైన జీవత్కావ్య రత్నమును సారస్వతమున క్షమూల్యాభరణముగఁ బ్రసాదించిన మొల్ల యనల్ప ధిషణా విభవము నభినందింతము!

## ప్రశ్నములు

1. మొల్లయొక్క జీవిత విశేషముల వివరింపుము.
2. మొల్ల వ్రాసిన గ్రంథమేది ? దానిని వ్రాసిన యితరకవు లెవరు ?
3. మొల్ల రామాయణమునందలి రసవత్తర భాగము లేవి ?
4. మొల్ల పోతన ననుసరించిన విధము లేవి ?

## విశేషములు

సమాసములను గుర్తించునది :–

గాంభీర్య వారాన్నిధి, అతివమిన్న, శ్రద్ధావృష్టి.

సంధులను గమనించునది :–

వర్ణ్యాంశము, అనల్పము, మల్లేశుఁడు, సంశయచ్ఛిన్నము.

వ్యాకరణ విశేషముల నెఱుంగునది :–

పండితురాలు, ఇర్వ్యేడ, కూరగాయలు.